# కృతజ్ఞత

శ్రీ శ్రీ వరదలు సామి
త్ర శ్రీ లవ్వారి తోడ తర్కించిన వి
శ్వ శ్రేయమ్ములు మకా
వ్య శ్రేణికి మకుటాలు వారికి నా థేంక్స్

నా గాదిలి భావుకులగు
భాగేశ్వరశర్మగారు భావోచిత ము
ద్వేగము గల ముఖచిత్రం
బాగా చిత్రించినారు వారికి నా థేంక్స్

కాటూరి వారు పేరిడ
పాటించి రచించినారు వారే చాలా
పాటుపడి పీఠికాగ్రిక
వాటమ్మును తెరచినారు వారికి నా థేంక్స్

తీయని హృదయపు సుధలకు
శ్రీ యం. శేషాచలం ప్రసిద్ధులు వారా
ప్యాయంతో ప్రచురణ సదు
పాయాలను చేసినారు వారికి నా థేంక్స్



ఈ 'సినీవాలి' నర్థమ్ము జేసికొనుట
కా పదమునకు నైఘంటి కార్థమిత్తు
చంద్రకళ కనబడు అమాస కిది పేరు
సర్వమంగళ పార్వతీసతికి నొప్పు

# అంకితం

పగ్గాలు లేనివాడా !
తగ్గని తారుణ్యకాంతి తళుకొత్త సదా
నెగ్గెడివాడా ! కొంగర
జగ్గయ్య మహాశయ ! కడుచక్కనివాడా !

నాడు తిక్కన గారిని చోడమనుమ
సిద్ధి మామగారనుచు సంబుద్ధితోడ
పిలుచునట్లు సంప్రీతితో బిలుచు మిమ్ము
చెలిమి కృతినిచ్చి జామాత జేసికొందు

బిల్హణ కథయను కవితా
ల్హారము మీ కొసంగు కామన నాలో
వీల్హాటుగ మెలగితోలగ
బిల్హణ చరితము బదులిది ప్రియముగ నిస్తా

పిన్న వయసులోన పితృదేవుని వలన
లలితకళల నోలలాడినారు
ఉడుకు నెత్తురు పొంగ యువజనోద్యమమందు
రాజకీయముల మెలంగినారు

పట్టభద్రిత నొంది బడిపంతులై నారు
పాత్రి కేయత్వాన బ్రతికినారు
ఆకాశవాణిలో నాంధ్రవార్తల జెప్పి
లోకంపు తీరు నేర్చుకొనినారు
నాటకమ్ముల నటియించి రాటుదేరి
నేడు సినిమాల తారగా నిలచినారు
స్వప్రయోజకులై మీరు సంఘజీవి
తాన నిలదొక్కు కొనినారు స్థాన మొకటి

సాగరమ్ముల జలముల సంతరించి
జగతికోసము వర్షించు జలదరములు
ప్రగతి గల సంస్థలకొరకు ప్రజలనుండి
ధనము సేకరించెడి ఘనాఘనులు మీరు

పటుశక్తి గల నటీనటుల కళాకారు
ల సహాయముల సేవళముగ గ్రుచ్చి
రెండుమారులు తెనాలి పురికళాశాల
కై 'మనోహర' నాటకమ్ము వేసి
వైద్యకళాశాల పాదుకొల్పంగ వ
రంగల్లులో ప్రదర్శనము లిచ్చి
మద్రాసు లోపల మరల నవ్వాటి నాం
ధ్ర మహిళాసభ నిమిత్తముగ నొసగి
మంచి పనులకు డబ్బు గడించిపెట్టి
నారు కడపటి వాటిలో నన్ను కూడ

కలుపుకున్నారు మనయొక్క చెలిమిగుర్తు
కీ 'సినీవాలి' నంకిత మిచ్చుచుంటి
కృతినొసంగుచున్న దినముక్రీస్తుశకము
నందు పదియు తొమ్మిది వంద లరువది శుభ
వత్సరాన 'ఆగస్టు' చివరి దినమ్ము
మద్రపురి పదిహేడు

ఆరుద్ర వ్రాలు

# దీవన

ఆరుద్ర! నీ ముద్ర నౌదల దాల్చి
విద్రుమ శోభతో వెలిగేటి వాణి
భద్రహస్తమ్మున బలికింప వీణ
గల గల మను కరకంకణధ్వనుల
కనుగులై కడలిరాయని ముద్దుపట్టి
కాలియందెల ఘలంఘులలు మినుముట్టి
చెలగ నీ నట్టిల్లు కలలు నిక్కలగ
నేలుగావుత సినీవాలితో శూలి

—కాటూరి వేంకటేశ్వరరావు

1

# స్వ విషయ సూచిక

## సాహిత్యోపనిషత్

ఆరుద్ర

ఏమయ్యా కవీ
నాదో మనవి
నువ్వెందుకు రాస్తున్నావ్
నూకలివ్వకపోయినా భావాల
మేకలెందుకు కాస్తున్నావ్ ?

శ్రీ శ్రీ

చెప్పిందే చెప్పిందే చెప్పిందే మళ్ళీ చెప్పడం
అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ కొందరికిష్టం
చెప్పంది చెప్పి మెప్పించాలని
చేస్తున్నాను నేను నా రచనల్లో ప్రయత్నం
అదే అనుకుంటాను కవిత్వం
అనుకరణం అనవసరం
అంతే కాదు అనర్థకం

అందుకనే దేవుణ్ణి సహా ఇమిటేట్ చెయ్యడం
మానెయ్యడం
అదీ నా ప్రయత్నం
అదే నా కవిత్వం
ఈ మేకలే నాలోని పెద్దపులికి ఆహారం
నా కవిత్వం ఆ వ్యాఘ్రం ఆకలి ఆకారం

ఆరుద్ర

అచ్ఛా స్వేచ్ఛాజీవి
చర్చకి చోటిచ్చావు
ఎవరూ చెప్పంది చెప్పడం
ఇలా చెప్పి మెప్పించడం
అదే నన్నమాట కవిత్వం అంటే
అయితే కొందరు మెచ్చనంటే ?

శ్రీశ్రీ

మెచ్చకుంటే మించిపోయెను

ఆరుద్ర

ఇది గురజాడకి
ఇమిటేషన్ కాదూ

శ్రీశ్రీ

ఇమిటేషను కాదు కొటేషను
ఇది వరకు కవులను మింగెయ్యాలనే
ఆకలి కాదిది
నిన్నటినుంచి ఇవాళ లాగ

## 3

నిరుటి కవులనుంచి నేటి కవులు పుడతారు
కందం రాసినవాడు కవేగాని
అంతింతో కందపద్య మల్లగలాడెల్లా
ఎంతమాత్రమూ కవికాడు.

ఆరుద్ర

ఒప్పుకొన్నాను తప్పకుండా ఈసంగతి
చెప్పావుకావు ఈ మెప్పుగురించి

శ్రీ శ్రీ

రుచీ, ఔచిత్యం ఇవీ ముఖ్యం మెప్పుకి
కవికోరే మెప్పు గండపెండేరం కాదు
సమాన ధర్ముల హృదయస్పందనం శిరఃకంపనం
అదీ గీటురాయి అసలైన కవిత్వానికి
వానలాగ ప్రజల హృదయాలల్లో వర్షించి
కొత్త భావాల బీజాలు జల్లేది కవిత్వం
ప్రజలు చప్పట్లు కొట్టే భావాలకి
పద్యాల రూపం ఇస్తే చాలదు
ప్రజాస్వామ్యాన్ని అంగీకరిస్తానే కవి
మెజారిటీకి అందని ఊహలు వెదకాలి
ఆ తర్వాత అతని మైనారిటీ వోటు
ఆక్రమిస్తుంది ప్రజాహృదయంలో చోటు
ఏమైనాసరే కవిత్వం
మేలుకొల్పాలికాని జోకొట్టగూడదు
అంతేనంటావా లేక——

# 4

## ఆముద్ర

అప్పుడప్పుడది జోల ముప్పు ముంచుకొస్తే కేక ...
అప్పుడప్పుడు అవుతుంది జీవితం దుఃఖభాజనం
అప్పుడు వెలుగు చూపించడం కవిత్వ ప్రయోజనం
అప్పుడప్పుడు జనం కళ్ళకి కప్పుతాయి ఏవో పొరలు
అప్పుడు కవిత్వం తొలగించాలి ఆయా తెరలు
బాధపడుతుంది ఒకప్పుడు గాయపడిన మనస్సు
గాథలను చెప్పి ఊరడించడమే కవియొక్క తపస్సు
అప్పుడప్పుడు అధికారులకి పోతుంది కామన్ సెన్సు
అప్పుడు ఎక్కుపెట్టాలి కవి తన కవితాధనుస్సు
ఇప్పుడిప్పుడు పురోగమిస్తోంది మనయొక్క దేశం
ఇది కవిత్వానికి అనువైన నిజమైన సన్నివేశం
ఎప్పుడో మానిషాదతో పుట్టిందట మొదటి కవిత్వం
ఎప్పుడైనా అలాంటి ఘటనతో పుట్టడమే దానితత్త్వం
అక్రమం జరగడం కవితకి నాందనేది ముఖ్యం
అంతటా అంతర్లీనంగానే ఉండాలి భరతవాక్యం
కవిత్వం సైన్సు కారాదు కవి రచన కఠినమైన థీసీస్సు
కావాలి అది ఎడారిలో ఒయాసిస్సు అనుభవాల
తేట సరస్సు

అందరికీ ఉపయోగపడాల్సినదే కవిత్వం
కొందరికి ఊహాకందక పోవచ్చు లోని రహస్యం
అప్పుడు సామాన్య మానవుడికి చేయూత
కావాలా సహృదయుడైన వ్యాఖ్యాత?

5

శ్రీ శ్రీ

కవిత్వంమీద కవిత్వంకూడా కవిత్వమే
అది ఎప్పటికైనా తెలిసిపోయే రహస్యమే
ఈలోగా ఎవరైనా టికమక పడుతున్నప్పుడు
వ్యాఖ్యాత జోక్యం చేసుకోక తప్పదు
భావాల సరిహద్దుల వద్ద కాపలా కాయాలి కవి
ప్రపంచాన్ని ప్రజానీకానికి విశదము చేయాలి కవి
చక్రాల్లో చక్రాల్లాగ అర్థాల్లో అంతరార్థాలుంటాయి
కొంతమట్టుకే బోధపడవచ్చు కొందరికి
ఇంకా అందులో ఏముందో చెబుతాడు వ్యాఖ్యాత
అర్థంకాని రహస్యం లేనట్టే అసలే బోధపడని
దంటూ ఏదీ ఉండదు

అన్ని కళల్లాగే కవిత్వంకూడా
ఏకకాలంలో రెండు లెవెల్స్‌లో పనిచేస్తుంది
అందుకే అసలైన కవిత్వం
ఏకకాలంలోనే పండిత పామరజన రంజకం
ఎవరో అనగా విన్నాను
"మనుష్యులంతా సమానులే గాని
కొందరు మరికొంచెం ఎక్కువ సమాను" లని
విదూషకుడి నోటంట వచ్చే నిజం లాంటిదిది
మనుష్యుల్లో హెచ్చు తక్కువలు సర్దుదాం మొదట
మనస్సుల్లో ఎగుడు దిగుడులు సర్దుకొంటూ యాపిదప
సరేగాని నేనొకటడుగుతాను చెప్పు
ఛందస్సుల నియమ బంధంలో లేదా ముప్పు?

ఆరుద్ర

ఏమిటి చెప్పడం ఎలా చెప్పడం
అనేవి రెండూ రెండు చక్రాలు
ఈ రెండూ సమంగా ఒప్పడం బండీని తిప్పడం
అనేవే కవితా సౌలభ్యతత్వాలు
ఈ రెండిటిలో ఏ ఒకటీ కాదు మిన్న
ఈ రెండిటిలో ఏది లేకపోయినా బండిసున్న
చెప్పడానికి ఏదైనా ఉంటే, హృదయం
విప్పడానికి అవకాశం వస్తే
ఉబలాటం కాక ఉద్రేకం పుట్టుకొస్తే
కీర్తికోసం కాక ఆర్తివల్ల అరిస్తే
చెప్పకుండానే ఏదో ఒక ఛందంలో
చెవికింపుగా వినసొంపుగా
కవి పలకడం కచ్చితంగా ఖాయం
ఇంతకు మించిన ఛందోనియమం
బంతి లేకుండా ఫుట్ బాలాడ్డం

శ్రీ శ్రీ

అది నిజమే అంటాను
మొదట లక్ష్యం తర్వాత లక్షణం
ఇందాకా నువ్వన్న మానిషాద
అనుష్టుప్పులో ఆలోచిస్తే రాలేదు
ఫుట్ బాల్ మాటెత్తావు కాబట్టి అడుగుతున్నా
పోటీలకి ప్లాట్ ఫారం కావాలా కవిత్వం

# 7

## ఆరుద్ర

స్పర్ధసే వర్ధతేగా విద్య
అర్థమైన స్పర్ధ, అనర్థకమైన స్పర్ధ
అంటూ ఉండనే ఉంటాయి
మంచికి చెడ్డకీ పోటీ
కొత్తకీ పాతకీ భేటీ
అనాదినుంచీ అభిప్రాయాలు
మల్ల రణం చేసే గోదా
మంచి కవిత్వమే కాదా?

## శ్రీ శ్రీ

ఆరోగ్య కరమైన పోటీని
అంగీకరించాలంటా నేను
రిఫరీని మోసంచేసి గెల్వొచ్చుగాని
ప్రేక్షకులు లక్ష కళ్లతో ఈక్షిస్తూనే ఉంటారు
న్యాయం గెలుస్తుందన్నమాట నిజమేగాని
గెలిచిందంతా న్యాయంకాదు
బాగా ఆడి ఓడిపోయిన టీముకి
ప్రజల సానుభూతి ఎప్పుడూ ఉంటుంది
ఆదిలో అవహేళనపాలైన ఆధునిక కవిత
అభ్యుదయ మార్గంలో పయనించడం చూసి
ఆదరించడం లేదా నేటి మేలుకొన్న జనత?

ఆరుద్ర

ఎవరికోసం కవిత్వం?
ఎందుకోసం నవత్వం?

శ్రీ శ్రీ

మనిషికోసం కవిత్వం
మంచికోరి నవత్వం
అయినా కవిత్వానికేముందిలే విలువ
అది ఎవ్వడూ మొయ్యలేని సిలువ
మాట్లాడడం ప్రారంభించినప్పుడే మనిషి
కొట్లాడడం సాగించాడు కినిసి
భయాలూ అనుమానాలూ ప్రసాదించింది చీకటి
ప్రపంచం అనంతం అని ఆవులించింది రోదసి
ఆదిలో భగవంతునివైపు ప్రయాణించాడు మానవుడు
మానవుడివైపు ఇప్పుడు తరుముకొస్తున్నాడు
దానవుడు
మానవుణ్ణి నేడు వెదుక్కుంటున్నాడు ఈశ్వరుడు
మానవుడు మానవునిమీద పగ పట్టాడు
మారణాయుధాలు సిద్ధంచేసి తొడకొట్టాడు
పర్యవసానం భయపెడితే ఊపిరి బిగపట్టాడు
ఎక్కడనుంచి దొంగిలించాడు అనలాన్ని
ఎలాగ బానిసని చేసుకున్నాడు అనిలాన్ని
ఎలాగ మచ్చికచేసుకున్నాడు జంతుజాలాన్ని
ఎన్ని రకాలుగా ఊహించాడు కాలాన్ని

వేళ్ళమీద లెక్కలు గుణించాడు
కాళ్ళకి రెక్కలు భావించాడు
ఎప్పటి కప్పుడే అతనిది నవత్వం
నవత్వం ప్లస్ మానవత్వం ఈజీక్వల్ టు కవిత్వం
కాని ఒక సందేహం; అడగనా?

ఆరుద్ర

అడుగు.

శ్రీశ్రీ

యాభై శతాబ్దాల రోగం
ఇంతట్లోకే ఎలాగ పోవడం
పాతకాలపు పైత్యం
దానికెలాగ వైద్యం
ఎద్దుపుండు కాకికి రుచి
ఇవాళ రమ్మంటే యెలావస్తుంది శుచి?
కొండలూ సముద్రాలూ కాపాడాయి గడ్డని
పక్షులు పోషించాయి ఇక్కడపారేసిన బిడ్డని
ఔను మనం గొప్పవాళ్ళం వన్నపానైం
అలాగ నిప్పుడూ రేగడం అదే గొప్పకై్రం
నిదానించు ఆరుద్రా ఈ రోగాన్ని
నిరూపించు ఈనాడు రెచ్చిన వేగాన్ని

ఆరుద్ర

జ్వాలలో వత్తి చుట్టూ ఉంటుంది నీలిమ
అదిచీకటి అనుకొంటాం కాని కాదుసుమ

మానవుడు సహజంగా చాలా మంచివాడు
కానీ అవగాహన ఆటూ పోటులమధ్య పడ్డాడు
ఆదిలో ఎడ్వెంచరు వల్లనే పొట్టపోసుకునేవాడు
ఆ అనుభవాన్నే సాటివాళ్ళ దగ్గర గానం చేసేవాడు
అందుకే గణంలో ఎవడుచేసిన గొప్పయినా
అందరికీ ఒప్పేది
ఆగామికాపురంలో జాగ్రత్తగురించి పాఠంచెప్పేది
అవే ఆదిమ సమాజాల కవితా ప్రయోజనాలు
వీటినుంచి మానవుడు పయనించాడు బహు
యోజనాలు
అందుకే తాతలు తాగిన నేతులని తలచుకొని
కొందరం కొందరం తేన్చి మేను వాల్చుతున్నాం
వర్తమానకాలం గురించి కవిత్వం చెప్పందే
ప్రవర్తనలు మార్చడం అసంభవం అనకతప్పదు
ఈనాటికీ యింకా గతానికి గబ్బిలాల్లాగ
వేళ్లాడుతున్నవాళ్లు వేనవేలున్నారు
అదే కథ అదే ప్లాటు అదే వర్ణన
ఎదో యథాశక్తి ఉపమానాలు
వాటికైనా పాతవే కొలమానాలు
వెనక చూపువాళ్లు వేయిమందున్నా
ముందుచూపు కవి ఒక్కడు చాలు
వాడు అవశ్యం కలిగిస్తాడు మేలు
మేలుకొంటాడు రోగిష్టి మానవుడు

కోలుకొంటాడు పద్యాల పత్యం తిన్నవాడు
పాములాంటి దానికి విరుగుడుంది
పాత తత్త్వానికి లేకపోతుందా ?
పండితుడు పాత గోతిలో పడినప్పుడు
పామరులు ఊరుకోరు
కట్టుకొంటారు కావలసినపాట
పాడుకొంటారు అది ప్రతినోట

శ్రీ శ్రీ

చూశావా ఆరుద్రా ఒక తమాషా
సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా
మూఢాచారాలు మారుతూ ఉంటాయి నిజం
కాని, సంప్రదాయం తాత ముత్తాతలనాటి ధనం
జాతికి జీవన నాళిక
జానపద గీతిక

ఆరుద్ర

పల్లె పదం మంచిది విన్నప్పుడు
ఝల్లు మంటుంది దేశీయుని గుండె
ప్రబంధం గొప్పది చదువు తున్నపుడు
చుర్రుమంటుంది పాఠకుని మెదడు
సంప్రదాయం తెలియాలి మొదటిదానికి
సంస్కారం కావాలి రెండోదానికి
ఏది మహాకావ్యం ఏది పూజనీయం ?

## శ్రీ శ్రీ

మహా కావ్యానికి క్రైటీరియా
సైజూ బరువూ కావయా
నిన్నటి మహాకావ్యం పద్ధెనిమిది పర్వాలైతే
నేటి మహాకావ్యం పద్ధెనిమిది పేజీలే!
పల్లె పదం, ప్రబంధం అన్నావు
ఒకటి గుండెనీ ఇంకొకటి మెదడునీ కదిలిస్తాయన్నావు
బాగుంది ఒప్పుకుంటున్నాను
ఇందాకా రెండు లెవెల్స్‌లో పనిచేస్తుందన్నానే కళ
ఇప్పుడది మళ్లీ జ్ఞాపకం చేస్తున్నాను
అందరికీ ఉంటాయి మెదళ్లూ గుండెలూ
అయితే మానవుడంతా ఒకే ఒక ఒళ్లు
హృదయం స్థాయి ఒకలాంటిదైతే
మెదడు స్థాయి ఇంకొక లాంటిది
పల్లె పదాన్ని ఈసడించే సంగీత విద్వాంసులున్నారు
ప్రబంధాన్ని చదవలేని పామరజనం ఉంది
కాని ఎక్కడో స్పందిస్తారిద్దరూ
సూటిగా గుండెల్ని తాకే పల్లెపదం
గాయకుడి మెదణ్ణి కదిలిస్తుంది
ఘాటుగా మెదణ్ణి సోకే ప్రబంధం
పామరుడి గుండెల్ని కరిగిస్తుంది
ట్రిపీజ్ ఆర్టిస్టులిద్దరు క్రాస్ అయిన క్షణం
మెదడూ హృదయం మిళితమయే గుణం
అదే మహాకావ్యానికి ఏకైక లక్షణం

ఆరుద్ర

కావ్యం ఏదైనాసరే కనీసం ఒక రిక్వైరుమెంటు
కావాలి కవిత హృదయానికి నరిష్మెంటు
కారాదు ఏనాడు మెదడుకి పనిష్మెంటు

శ్రీ శ్రీ

ఎక్సలెంట్ ఆరుద్రా నీ స్టేటుమెంట్

ఆరుద్ర

నా నృషిః కురుతే కావ్యం
అంటారు ఇదెంతవరకూ భావ్యం ?

శ్రీ శ్రీ

పాపాల కుబుసం విడిచిన పాములాంటివాడు ఋషి
పరిపక్వమైన అనుభవాలే అతని పడగమీద మణి
అందరికీ దూరంగా అరణ్యాలలో అతనుండడు
అతనిలోపలి అరణ్యంలో అందరూ ఉంటారు
జంతువుల్ని శాసించే సర్కస్ మానేజరతను
అలాకానినాడు కవే కానేరడతను
సమకాలిక జీవితమే సత్కవితా వస్తువు
అనృషీ కుకవీ చచ్చినవంటే పడి చస్తురు
పలాయనం పనికిరాదు భగవంతుడి వైపైనా
నిలబడాలి తను చూసే నిజం కోసమేమైనా
అతడు ద్రష్ట అతడు స్రష్ట బ్రతుకన్నతడు పరాకాష్ఠ
అందరికీ కనిపించని వాటను స్పష్టంగా చూస్తాడు
రంజన కలిగిస్తాడు సందేశం వినిపిస్తాడు

## ఆరుద్ర

రంజన కలిగిస్తాడన్నావు ఋషిలాంటి కవి
రంజన ఎలాంటిది ? ఎంతవరకూ దాని అలవి
అల్లసాని పెద్దన అన్నట్టు హరువు మొల్లమవడమూ
ఆనందో బ్రహ్మమందుకోవడమూ అదేనా రంజన
మంచి రచన చదివాక బాగా భోంచేసి నట్టుండాలి
కొంచెం బాధపడాలి చించుకొన్నట్టుండాలి
మనస్సుకి జ్వరం రావాలి ఒళ్ళు విరగాలి
ఈ బాధలోంచి తేరుకొని బాగుపడాలి
ఋషిలాంటి కవి సందేశం వినిపిస్తాడన్నావు
మానవుడు ప్రాపంచిక భౌతిక ముముక్షువు
మంచి కవిత్వం తెరవాలి వాని జ్ఞానచక్షువు
నిత్యనైమిత్తికాలనుంచి నిరంతర సత్యాలదాక
పరిత్యంశం గురించి ప్రవచించాలి మహాకావ్యం
రంజింపచేస్తూ సందేశమిచ్చేదే మహాకావ్యం
అని నిర్వచనం చెయ్యడం చాలా భావ్యం
ప్రవాహంలా ఉంటుంది మహాకావ్యం
ప్రభావంలో పడేసుకొంటుంది మహాకావ్యం
తనవేపు ఆలోచనల్ని లాక్కొనే సూదంటురాయి
సాఫుచేసి హృదయాలని నిగ నిగ లాడించే ఆకురాయి
ఈ గుణాలులేని కావ్యం కావ్యంకాదు బండరాయి
ఇది కవిత్వం గురించి పాలసీ స్టేటుమెంటు
ఇక చెప్పు ఎంతవరకు అవసరం కవితలో
ఎక్స్పర్మెంటు ?

శ్రీ శ్రీ

అడుగడుగులో అడుగు వేసుకుంటూ
వెళ్ళడం అదే డిసిప్లిన్
అది లేని జాతికి పురోగమనం నిల్
అయితే ఆ డిసిప్లిన్ పేర అన్వేషణని
అరికట్టకూడదు
అర్హతలు మొదట సంపాదించాలి
ఆమీద అన్వేషణ సాగించాలి
ఆర్డర్లు తీసుకోవడం తెలియని వాడు
ఆర్డర్లు ఇవ్వకూడదు
ఛందస్సుల అశ్వహృదయం తెలియనివాడు
సవారీకి తయారు కాకూడదు
కాలు జారడం నేరం కాదు
కారణం తెలుసుకోలేకపోవడం ఘోరం
పొరపాట్లని గుర్తిస్తే అవే మనకి
చాకిరీ చేస్తాయి

• ఒకసారి జరిగితే పొరపాటు
తరవాత జరిగితే అలవాటు
సకాలంలో గుర్తించాలి
ఈ పొరపాటెప్పుడు మారుతోందో అలవాటుగా
కవిత్వానికి కూడా సైన్సుకి వలె
కావాలి రిసెర్చ్ ఎక్స్‌పెరిమెంటూ
కాని దాని పరమార్థం

పలాయనం కాదు ప్రజాక్షేమం
పరిశోధన చీకట్లో చిందులాట కాదు
జీవితాన్ని పణంపెట్టిన చీట్లాట కాదు
ప్రగతి శీలం కాలం, సంఘర్షణ దాని మూలం
పరిణామం దాని నైజం పరాజయం లేనిది ప్రాణం
పారంపర్యం గమనించి
పారస్పర్యం గుర్తించి
పరిశోధన సాగిస్తే బయలు పడుతుంది రహస్యం
ఈ దారిలో ప్రయాణానికే ఇంకో పేరు కవిత్వం!



వరద

సందేహిస్తున్నారు నవకవిత్వాన్ని
సాహిత్యంలో మన బంధుత్వాన్ని
ఎందుకోసం మన ధ్యానముద్ర ?
ఎందుకీ చైతన్య వంతమైన నిద్ర ?
ఏమంటావు ఆరుద్ర ?

ఆరుద్ర

"కల నిజపరచడం కాదు కవిత్వం
నిజాన్ని కలగనడమే దాని తత్త్వం"
స్వప్నంలోని ఆదర్శవంతమైన స్వర్గం
సాధించినమీదట అదే సాక్షాత్తూ నరకదుర్గం
కలలు కన్నారు ఆదిమ రాజకీయఋషులు
కలలు కన్నారా స్వార్థరహిత పురాణపురుషులు
చక్కటి కవిత్వంయొక్క పర్యవసానం
ఒక్కగా నొక్క భూతలస్వర్గం
జాగ్రదవస్థలోనే దుస్స్వప్నం
"అందుకే అనుభవం నినదించడం కవిత్వం
భరాన్ని భయాన్ని వచించి చించడం కవిత్వం"

వరద

అవును, నిజం నువ్వన్నమాట
అందుకే మనం అల్లుకొంటున్న పాట
కానీ యీ లోకంతీరు చూడు
కవితకు కలం కాగితం మాత్రం తోడు
అంతకన్న అర్థంకాని జనం
అనర్థకాలను వెతుక్కుంటున్న మనం!
మనిషి వ్యథల గుండె చెరువు
మనిషి కథల కలల కరువు
మంది మధ్యదారి తెగిన రథ్య
బొందితో స్వర్గం నిత్యం ఆరాధ్య!

నిచ్చెనలా నిలిపి కవిత్వాన్ని
చచ్చిన వారెందరీ తత్త్వాన్ని !

ఆరుద్ర

సమాజంలో కవిగూడా ఒకడే
అయినా విరుద్ధమైనవాడు అతడే
సబ్జెక్టివ్ భావాన్ని
ఆబ్జెక్టివ్‌గా రాసినట్టే
ఆబ్జెక్టివ్ బాధల్ని
సబ్జెక్టివ్‌గా రచించవచ్చు;
పోగొట్టుకోన కూడదు వ్యక్తిత్వం
అయితే ఆధునికం అంతా అవ్యక్తం
వర్తమాన కవితయేమిటో తెలుసా వరదా ?
అది భూత భవితవ్యాల మధ్య ట్రాన్స్‌పరెంట్ పరదా !

వరద

సామాన్యులకీ వర్తమానం
సాయుజ్య చింతనలో నిత్యావసానం
గతంలో బ్రతుకుతారు
స్వగతంతో చితుకుతారు
నలుగురితోపాటు నారాయణ
తొలిసీతుల పారాయణ
దేహం వారికొక పెనుసందేహం
దేశం వారికి సంకుచిత సందేశం!

## 19

ఆరుద్ర

సందేహం లేని సంశోధన
సందేశం లేని సంవిధాన సాధన
కానేరదు కవిత్వం
దానికి సిద్ధించ దమరత్వం

వరద

సందేశం ఎవరినుంచెవరికి ?
సందేహం దేనికి చివరికి ?

ఆరుద్ర

సందేహం నిత్య నైమిత్తికాల గురించా ?
సందేశం మామ్మూళ్ళు చిల్లర విషయాలమీదనా ?
ఏది చిల్లర, యేది మామ్మూళ్ళు, యేది రొటీను ?
క్షణక్షణం ఉత్పన్నమయ్యే సాదాసమస్యల
పరిష్కర్తపనికి కవిత రాజీనామా చేస్తుందా ?
అసలు ఆ ఉద్యోగం కవిత్వం చెయ్యాలా ?
ఐన్‌స్టయిన్ని ఐదోయెక్కం నేర్పమన్నట్టు
కవిత్వంతో జీవితం గొడ్లపాకలోని
కసువు ఊడ్పించాలా ? కవిత గొరక చీపురా ?
కవిత్వం రోజూ వాడని ట్రూత్ బ్రష్ !
యాంత్రిక నాగరికత కాంతివంతమైన చీకటిలాగ
జీవితాన్ని ఆవరించి వేళ్ళాడుతున్నపుడు
శాస్త్రం, చరిత్ర, చర్చ, ఛందస్సుకి విడాకులిచ్చినపుడు
జాతి జీవనంలో తీరుబాటు తగ్గుతున్నపుడు

కవిత్వం తన పాత ఆఫీసునుండి నిష్క్రమిస్తుంది
వేదాల కాలంలో దాని దారి వేరు
మానవ నేత్రం చూసిన ప్రతి చిత్రాన్నీ
గానం చేసిన రోజులు కావు
ఆదిలో దైనిక సమస్యల్ని మంత్రం పరిష్కరించింది
నేడు భౌతిక సమస్యల్ని యంత్రం పరిష్కరిస్తున్నది
వ్యాపార ప్రకటనల మోసానికి కరపత్రాలగాత్రానికి
కవిత్వం సహాయ విద్రోహి కారాదు
కవిత్వం విజ్ఞాన కూపంలోని ఉదకమే కాని
బాల్చీ కాదు, చేంతాడు అసలే కాదు
నూతన ఛందస్సుల యంత్ర పరికరాలతో
నూతిలోని నీరు తోడుకొనడం మేలు
దప్పిక తప్పక తీర్చగలిగేది కవిత !
ఎప్పటికైనా మానవ పథికుడు చేరుకొనే
గొప్ప విశ్రాంతి మందిరం కవిత !
ఆధ్యాత్మిక ఆముష్మిక చింతనతో
సత్యం శివం సుందరం స్వరూపాల చూపించి
అనంత భౌతిక సందేశం వినిపించేది కవిత !
అయినా యాంత్రిక జనులది లక్ష్యపెట్టరు
వారి చెవుల చవులు పుట్టవు
వారు కవిత్వాన్ని అన్నం వండ మంటారు
ప్రమిదలోనూనెకమ్మంటారు
ఆకలికి తట్టుకోలేరు
చీకటికి భయపడతారు

వ ర ద

జీమూతం పరిధి
జీవితం పరమావధి
ఎరుపు దిగని సంజవేళ
ఏ సంకేతాల స్వరమేళ
భయపెడు తోంది వీళ్లని ?
ప్రార్థించ మంటున్నది దేవుళ్లని ?

ఆ య ద్ర

మొద లెక్కడో తెలియని పరుగు
తుద బోధ పడక గుండె కరుగు
ఏమీ చేత కాక వీళ్ల విలాపం
దారి మధ్య ఆరిపోతుంది వీళ్ల దీపం
అందుకే తోడు రమ్మని అభ్యర్థన
దేవుడికి నిరంతర ప్రార్థన !

వ ర ద

ఎలుగు లేని వాడికెలా కనిపిస్తుంది వెలుగు
పులుగు కాని వాడికెలా విహాయసదృక్పథం కలుగు ?
కవిత్వం విధ్వంసక కారణ విచ్ఛేదన
కవిత్వం నిత్య సౌందర్యారాధన !

ఆ రు ద్ర

ఏది సౌందర్యం ?
ఏది మాధుర్యం ?
విచిత్రమే సౌందర్యం

విచింతనయే మాధుర్యం
అని కొందరు !
మరికొందరు
తలపులే సౌందర్యం
వలపులే మాధుర్యం
అనుచుందురు
ఏది సౌందర్యం ?
ఏది మాధుర్యం ?

వ ర ద

నిజం సౌందర్యం
నిజం మాధుర్యం

ఆ రు ద్ర

ఏది నిజమైనది ?
ఏమి రుజువైనది ?
కడలి నిజమైనదను కుంటాను
కదలిక రుజువైనదను కుంటాను
ఏది నిజమైనది ?
ఏమి రుజువైనది ?

వ ర ద

కనిపించేది మట్టుకే కాదు నిజం
కనిపించనిది కూడా నిజం
రుజువు చెయ్యని నిజం
రోజూ చూస్తున్న మాట నిజం

నిజానికి ఋజు వక్ర మార్గాలు లేదు
ఋజూ కానిది కవిత్వానికి ఖనిజం!

ఆరుద్ర

అయితే కవిత్వం శ్రమా?
లేక కుటీర పరిశ్రమా?

వరద

శ్రమ లేనిదే మనోరమ సాక్షాత్కరించదు
శాశ్వతాన్ని ప్రస్తుతం ఆవిష్కరించదు
వినియోగం లేని పరిశ్రమ వ్యర్థం
విశాల హృదయానికి మొదటి మెట్టు స్వార్థం!
కవిత స్వార్థం
కవిత రమణీయార్థం!

ఆరుద్ర

రాబర్టు గ్రేవ్సు చెప్పినట్టు
ముత్యాలు చేరుకుంటాయి నగల కొట్టు
పద్యాలు చదవబడతాయి ప్రజలచేత
వర్తకుని మనసులో పెట్టుకొని
శుక్తి ముక్తి కాలను ధరించదు
ప్రజల దృష్టిలో నిడుకొని కవి రచించదు
బేహారి తానె ముత్యముల సేకరించు
అటులె ప్రజకూడ కావ్యముల నాదరించు!



౧

నే డమావాస్య ;
వేదనా నిలయమైన మనికితో
మనం కవితా సమరముజేయ
భారతరణము మొదలైన పరమతిథి
సమంజసమ్మగు నీ నాడు
మంచిరోజు
తరు లతా గుల్మ వల్మీక భరితమైన కారడవి
శుభ్ర మొనరించి కట్టినాడు మానవుడు నగరము
కాని
మరల నచట
తరు లతా గుల్మసఖులు వేదనలునిండె
లిప్త లిప్తకు ఆశలు
లుప్తమైన బ్రతుకు
జాగ్రదావస్థ దుస్స్వప్నమగును
ఆశయమ్ముల నమ్ముల జేసికొన్న వీరునకు
పీడకలపాడు పీడలేదు.

చెరిగి పోయింది చెరిగి పోయింది
నీపాదుకల చెదిరి పోయిందట
చిరిగిపోయిందిలే నీవు ఎగరేసిన
నీ మనసులోని నల్ల బావుటా
నడచి నడచి నచ్చింది కదా
పాత పద్య పాదాలకి అలసట
విప్పకూడదా మరో పుస్తకం
తిప్పవెందుకో కొత్త పుట
నీకు ఆసరాగా ప్రేమనిలబడి
అవుతుందిలే హామేషా బాసట

పాడుతాను నాకు తెలిసిన నగరం గురించి
నగరంలో నాతి గురించి నీతిగురించి
రకరకాల సన్నివేశాలలో ఆవేశాలలో
ప్రకటించుతాను మనలాంటి మనుష్యులగురించి
అనవరతం హోరెత్తే సముద్రాన్నిమించి
మనుష్యులగురించి తప్ప మరోవస్తువుమీద
మాటలు కట్టడానికి నాకు మనసురాదు
పాటలు పాడమంటే నాకు నవ్వొస్తుంది
ఇక్కడి నకిలీప్రకృతి దృశ్యాలమీద
ఇక్కడి కత్రీ ఉద్యానవనాల మీద
ఊసడింపుగా పాడేరు ఇప్పటిదాకా కవులు
ఈ దృశ్యాలు నగరంలోని వ్యక్తులకు

సిస్తలైన సరుకు వెలసరసం నగదుబేరం
ఆఫీసులు ఆవలించిన పిమ్మట
కార్ఖానాలు రగ్గు కప్పుకొన్న తరువాత
పట్టపగ్గాలు లేని బై సికిళ్లు
మతిచలించిన మోటారు సైకిళ్లు
పట్టాలతో చెట్టపట్టాలు వేసుకొన్న ట్రాంబళ్లు
కార్లు కాళ్లు పోటెక్కిన ఆటోరిక్షాలు
పట్టణంలో పరిశ్రమించే వాళ్ళను
వలపు నోచని మెదళ్ళను నిండని నోళ్ళను
అలసిపోయిన కళ్ళను వాళ్ళను పీళ్ళను
భద్రంగా యిళ్ళకు మోసుకొచ్చిన పిమ్మట
వాళ్ళ మెదళ్ళ నోళ్ళ కళ్ల కన్నీళ్ళను
కావ్యంగా శ్రావ్యంగా ఆలపిస్తాను
వాళ్లలోలోపలి నిశ్శబ్దాలను వినిపిస్తాను
దుర్గమ గహనాంతర సీమల్లోకి నడిపిస్తాను
స్వర్గ నరకాల సహజీవనం చూపిస్తాను

ఒకరితో ఒకరికి సంబంధం ఉండీ ఉండనట్టు
అంటీ ముట్టనట్టు తెలిసీ తెలియనట్టు జీవిస్తున్నా
ఆధునిక కవిత్వంలోని పద్యపాదాలలా కనబడుతున్నా
ఆధునిక నగరంలోని ప్రజలు ఒకేహారంలోనిపూసలు
ఒకేచక్రానికి ఆకులు ఒకే జ్యోతియొక్క రోచులు
ఒకే వృక్షంయొక్క ఆకులు కోరికలలో లేవు విభేదాలు
వేదనలో వేసటలో దరిద్రంలో లేవు తేడాలు

ప్రొద్దుగూకులు బానిసపడితే నిద్దరలో ఆటవిడుపు
అయినా అప్పుడు వంతెనలు విరిగిపోతాయి
తెరచాపలు చినిగిపోతాయి
ఎండిపోయిన నదిలో ఏ పడవలు నడుస్తాయి
ఎండిపోయిన నదిలో ఏ మొసళ్లు కరుస్తాయి
ఏటిగట్టున కన్నాల్లోంచి ఎండ్రపీతలు బయటకొస్తాయి
బొరియల్లోని నక్కలు కారు కొండచరియల్లోని
చిట్టెడలు కారు
నగరంలోని పాపులు పులితోలు కప్పుకొన్న
సాధుగోవులు
మద్రాసులోని మధ్యాహ్నాలను మచ్చికచేసుకొని
చూడు
బొంబాయిలో నీ సాయంత్రాలను బోరవిరుచుకుతిరుగు
కలకత్తా బీరువోని రాత్రులలో
కల్మషాన్ని కలయచూడు
హైదరాబాధ పడుతూన్న కాలాన్ని
అనవరతం నువ్వు పరీక్షించు
రచ్చకెక్కిన నాపసాని
కోరికల రాజధాని
స్వేచ్ఛపట్టుతప్పి పడిపోయే
ఓపిక లేని గడసాని
నగరం నీధర్మపత్ని కానేకాదు
ఉంపుడు గత్తె అంతకన్నా కాదు
వానలోతడిసి ముద్దయినా వలపించలేని

పీలికలు కట్టుకొన్న అనాకారి బికారి
షేలవంగానైనా ప్రేమించలేని అణాకానీ వికారి

ఎండిపోయిన నదిలోని పండుటాకుల గలగల
నేలకొరిగాయి ఎత్తిన పతాకాలు
నేలకరిచాయి పాతిన గుడారాలు
ఎన్నికల ప్రచారంలాగ ఎందుకూ పనికిరాని
రాకపోకలు
ఎవరూ నమ్మని వాగ్దానాలవలె ఎందుకో తెలియని
ట్రాఫిక్కు
నీ నగరం పొద్దున్నే ఎదురొచ్చే ప్రశస్తమైన
విశ్వాస్త
బలవంత ప్పెళ్ళిలోని ముద్దనష్టపు పెళ్ళికూతురు
మూగివాడి భావప్రకటన పేడివాడిమూషో పెళ్ళి
ఆడదాని మీసాల్లాగ అసందర్భంగా మొలచిన
పేటలతో
గూనివాడి వీపులాగ అసహ్యంగా పెరిగిన పేటలతో
నగరం నిన్ను ఆహ్వానిస్తుంది నగరంనిన్ను
ఉంచుకొంటుంది.
మందుపెట్టి దక్కించుకొనే పెళ్ళాంలాగ నిన్ను
కామిస్తుంది
నగరం నీ ముందరి కాళ్ళబంధం నగరం నీ కాలకూట
మకరందం

నగరం నీలి నైలాను చీరల తారు రోడ్లు ధరించాలి
తారురోడ్ల చీరలమీద మోటారుల జలతారు
కావాలి
పానీయపు టంగళ్ళ ఖరీదైన శాటీనులంగా ధరించాలి
షాపుల గ్లాసువిండోల లోకట్ జాకెట్ తొడుక్కోవాలి
నైటుక్లబ్బుల రమ్యమైన 'న్యూలుక్కు బ్రా' బాడీని
బిగించాలి
ఆధునిక రంగేళీయువతిలాగ నగరానికి మెదడు తక్కువ
షోకులెక్కువ ఆశయాలులేని ఆశలూ విలాసాలూ
ఎక్కువ
ఇండియా కాఫీ హౌసులో పొగిడే మగాళ్ళముందు
కూర్చొని
నాజూకుగా సిగరెట్ కాలుస్తూ సుతారంగా కాఫీ
పీలుస్తూ
రీటాహేవర్త్ ప్రణయాలు జేన్ రసెల్ వలయాలు
ముచ్చటిస్తూ
టైరన్ పవర్ గురించి కలలు కంటుంది ఆధునిక నగరం
శ్రీమంతుణ్ణి ప్రేమించడానికి ఆశపడుతుంది ఆధునిక
నగరం
అయిదంతస్తుల హోటేళ్ళ డాబామీది పూదోటలో
వెలుతురు తగ్గించిన ఎలక్ట్రిక్ దీపాల నీలి మసాబులో
పన్నెండు గంటల రాత్రి తరువాత పరిష్వంగ
నృత్యంలో
స్లోఫాక్సుట్రాట్ సంగీతానికి కళ్లు మూస్తుంది నగరం

డాన్సుఫ్లోరు మూాల తిరిగేటప్పుడు నృత్యంలో నిన్న
దుము కొంటుంది
నీ మీద చూపించిన ప్రేమే కేగుడాన్సులో ఇంకొకడి
మీద కూడా
నిష్కారణంగా నిష్కామంగా చూపెట్టే పింజారి
నీ నగరం.

టాక్సీలో ప్రియురాలిని మేటనీకి తీసుకెళ్ళు
సోడా ఫౌంటెన్‌లో పీచిమల్బా ఇప్పించు
అందమైన భయానక హాలీఉడ్ చిత్రం చూపెట్టు
జామ్‌సెషన్సుకి తీసికెళ్లి వెర్రిగా జైవ్ చెయ్
నగరం నిన్ను ప్రేమిస్తుంది నగరంనిన్ను పూజిస్తుంది.
కామ్‌గార్ మైదానంలో కార్మికుల మీటింగుకన్నా
స్టేడియంలో అమెరికన్ పద్ధతి కుస్తీలు చూడండి
జహాంగీరు ఆర్ట్ గేలరీలో చిత్రకళాప్రదర్శనంకన్నా
లామెడ్స్ గ్రౌండ్సులో నిపుట్ బాల్ పందెంవీక్షించండి.
రసిజికరంజనిలో శాస్త్రీయ పాటకచేరీకన్నా
పీపుల్సుపార్కులో బాక్సింగ్ మేచ్ గొప్పది
ఆలిండియా రేడియాలో ఆధునిక సాహిత్యంపై
టాకుకన్నా.
రేడియో సిలన్‌లో తారలగోష్టి సరదా వేసేది
లక్ష్మీపురం వై ఎం ఏ లో ప్రముఖుని ప్రసంగంకన్నా
క్లబ్బులో డబ్బువేసి కట్ జోకర్ రమ్మీ ఆడడంగొప్ప.
ఇది ఈనాటికి నాగరికత సభ్యత పూజ్యత.
ఇది ఈనాటికి నాగరికత సభ్యులయోగ్యత.

అసమర్థుని పరిపాలనలాగ అంధకారం ఆవరించింది నగరాన్ని. అంతదాకా మూసిన కన్నులు అర్ధరాత్రిన విప్పుతుంది నగరం. అంతదాకా చెప్పని కథల్ని హీనస్వరాన చెప్పుతుంది నగరం. నగరం కుడికంట్లో పుసి, మలికంట్లో కసి. నగరం తొలికథలో ఆకలి. మలికథలో చీకటి.

ఇది ఆవేదనా శిశిరం

మానవుడింకా పసరం

ఈ వేదనా శిశిరంలో ప్రతి మేధస్సూ ఒక మ్రోడు పచ్చ చచ్చినట్టి బీడు మూలుగుతున్న వల్ల కాడు గూడు అల్లుకునే సాలీడు. ఈ ఆవేదనా శిశిరంలో ప్రతిచైతన్య తరువూ ఇంగితజ్ఞాన పత్రాలను రాల్చివేసింది. అదృశ్యహలాలతో అవ్యక్తాలనిదున్ని అనుమానాలనుజల్లి అనవసర ఖేదాలను పండించుకొంటున్నారందరూ.

ఇది కఠిన నరకం

ఇది ప్రత్యక్ష నరకం

బోను తెరిస్తే నోరు తెరిచే పెద్దపులి నగరయామిని. బోలెడన్ని కథలకి చాచిన తనదీర్ఘహస్తాలతో స్వాగత వచనాలను చదువుతుంది నగరం. జీవితపు వరదల బురదలమడుగున అడుగున అతి తొందరగా చిందర వందరగా తిరిగే జీవులు అంతదాకా అక్కడా అక్కడా తిరిగి అప్పుడు చేరుకొంటారు విశాలమైన పావంచాల మీదికి

నగరంలో యామిని

నరకంలో ఆమని

ఇతడొక యువకుడు. పేరు సూర్యుడు. కళాశాల నుండి నిష్క్రమించి కళ్ళుమూసుకొని నగరంలో ప్రవేశించాడు. కడుపుమంటతో కాలిపోతూ కన్నీళ్ళపై స్వారిచేస్తూ పేవ్ మెంటుమీద పడుకోడానికి పెద్దదైన సంస్కారం చేతపట్టుకొని స్వగతంగా సతమతమవుతున్నాడు ...

దావానల తులోజ్జ్వల
భావానల కీలలోన పడుతూఉంటూ
భావాలకు బానిసనై
కావాలని గాలిమేడ కడుతూఉంటూ

ఘోరాటవి ఈ నగరం
పోరాడే శక్తి లేదు పోలేను ఎటూ
లేరెవరూ నాఅంటూ
కూరిమి బంధువుల పసిడి గొలుసులు తెగినై

నేస్తున్నది కలలపచ్చడం. చేస్తున్నది పొద్దు పుచ్చడం, చూస్తున్న పాతకాలకి అర్థం తెలుసుకున్నవాడు అనుకుంటున్నాడు అంతర్గతంగా ...

ఇక్కడ దొరకని దేదో
చక్కదనం అభిలషించి
ఎక్కడికో పోదామని
రెక్కవిప్పు చైతన్యం

కనుపించని చక్కదనం
నను పిలిచిన మరుక్షణం

తనువంతా పులకరించి
పెనుతాపం పుటకరించు

కొడికట్టిన మదిలోపల
నడయాడును శైతల్యం
కడలిలాగ కనబడినా
సడిలేనిది వైఫల్యం

కనుకొలకుల నుండి కరిగి
నును వెచ్చని నైరాశ్యం
పనికిమాలి సుడులు తిరిగి
కనుల మరల గడ్డకట్టు

మొండిచేయి కనులు దోలచి
గుండెలోన గునప మగును
పండదు ఏనాటికైన
ఎండమావి నాకోరిక

కదలలేని బండరాయి
చెదపట్టిన నా ఎడంద
వదలలేదు అదేలకో
చదల కెగురు ప్రయత్నాలు

ఇతను అప్పులున్న డెస్టిట్యూట్ చీకట్లచే
తినబడ్డ సూర్యుని సబ్‌స్టిట్యూట్...

ఆర్జించు కొన్నట్టి ఆవేదనాగ్ని
బూర్జువా సరదాల బూజుధరించ
తనలోన తానుగా తపియించు వనిత
మనవాడి సరసనే మథనపడసాగె

"ఎవరేనా నాకు తియ్యని విషమిస్తే బాగుండును
నను మంత్రిస్తే స్వప్నంలా కరిగిస్తే
బాగుండును బాగుండును
నా వేదన దగ్ధంచేసి నన్ను సమ్ముగ్ధనుచేసి
నా కాళ్ళకి చక్రాలు
నా కళ్ళకి స్వర్గాలు
నా కలలకు రెక్కలిచ్చి
ఇంకో లోకంలోకి మరో తీరానికి
నన్ను ఎగరేసుకు పోతే బాగుండును"

ఈరీతి ఆనాతి ఎదలోన కుముల
చేరి వేరొకనారి చింతించ సాగె

"ఒదులుగానున్న పొదిగిలిలోంచి
బిగించిన పిడికిలి లోకి
మొద్దుబారిన కత్తులబాట నుండి
పదును పట్టిన ద్వేషాల మార్గంమీదకి
నిస్సారమైన జీవితం నుండి
సారవంతమైన కష్టంలోనికి
మళ్ళించగల మొనగాడెవరు
మనసు చెల్లించగల వాడెవరు?"

తొలికాంత మలికాంత దుఃఖాన్ని బాప
పలికింది సన్నగా పట్టుకొని చేయి...

"నీకన్నుల కావిరి బరువు తగ్గిందా సోదరీ
కలతల పడవల మీదపోయి చేరుకుందా మద్దరి
చీకటిలోకి వలస పోదాము
జీవితాలు వదిలేసి వెళదాము
ఎన్నటికి కురిసేను స్వాతివాన
ఎన్నటికి ఆణిముత్యాలు పడతాయి మనస్సులలోన"

మలికాంత తొలికాంత మాటలువినుచు
పలికింది తనచేయి వదిలించుకొనుచు...

"పట్టాలి ఎవరికివారే ఒంటరిబాట
పాడుకోవాలి లోలోపల చేదుపాట"

"అనుమానాలను చేతపట్టుకొని
పవమానాలను ఊతపట్టుకొని
పద పోదాం స్వప్నంలోనికి
పదపోదాం నల్లని నరకంలోనికి"

"మన అనురాగాలను చూపెట్టేందుకు
అనువైన వాడెవడూ లేడు
మనస్తాపాన్ని ఆరవేసేందుకు
మగదండల దండెం లేదు"

"కన్నీళ్ళసిరాతో కావ్యాలు విరచించేవారు
వ్రయ్యలైన హృదయశకలాలతో

బొమ్మరిల్లు కట్టుకోనేవారు
అలసిపోయిన జీవితాలతో
ఆడుకోనేవారు
సిపాయికి రూపాయిమేపి
అపాయాలు తెప్పించేవారు
కూర్కులో కూరుకు పోయిన
కోర్కెల రథచక్రాన్ని విరకొట్టేవారు
తెలిసి తెలిసి చేయరానిపనులు
చేసేవారు వాటికి వెల్ల
వేసేవారు
పెద్దమనిషి తరహాలోకం ఇది
నిద్రమిద్దా మిక్కడనుండి
విశ్రమిద్దాం మృత్యువులోపరుండి''

''ఆశమీద జీవిస్తూ
శ్వాసతీసుకోవడం కష్టం''

''చూసిచూసి మోసాలకు తలఒగ్గడం
దోషాలవైపు మొగ్గడం''

''ఎందుకు మనకు చెల్లీ
పోదాం వెనక్కి మళ్ళీ''

ఇరువురు ముందుగా నేకీభవించి
బరువుగా బాధగా పయనమైనారు

పయనమై పతనమై వారిలోవారు
భయముగా మెల్లగా భాషించుకొనిరి.

"దారిలో బోనులుంటాయి
వాటిలో పడకూడదు మనం"

"దారిలో ఎర లుంటాయి
వాటిని తినకూడదు మనం"

"పద పోదాం చిక్కని చీకటిలోనికి"
"పదపోదాం పాతాళంలోనికి పా్రికి"

తొలికాంత చంచల మలి కాంత చపల
చెలికత్తె లఘుముల జేయుట జూచి
మనవాడు సూర్యుడు మనసులో కుమిలి
అనుసరించెను వాళ్ళ ఆత్మల వెనుక...

"పేరుకొని పోయింది పాపాల సరస్సు
పేరుపోయింది చెడిపోయింది మనస్సు
ఇది ఉవ్విళ్ళూరించే ఊబి
మానవుడు ఆనందలోభి
కళ్ళు తెరచుకొని కాళ్లు విరుచుకొని
పతనమవుతున్నా రెందరెందరో
పడుతున్నారు తలక్రిందులా ఇందులో
కొత్తగా వచ్చే మీ రెవరు మీ రెవరు ?"

అనుచు ప్రశ్నించగా అతనికి వాళ్ల
మనసులు నిలచి సమాధాన మొసగె....

"వాడిపోయిన పువ్వులం
ఓడిపోయిన జవ్వనులం"

"చెరిగిపోయిన చిరునవ్వులం
చెదరిన స్వప్నాలం"

అనుచున్న వారల ఆత్మల నిలిపి
మనవాడు తా బ్రతిమాలుకొన్నాడు....

"వద్దు పడవద్దు ఇందులో మునగొద్దు
ఇదిమీరు చేరరాని సరిహద్దు
వెళ్ళిపొండి వెనక్కి-మళ్ళి
నడవకండి ఈ పాపంలోనికి
పడవద్దు అగాధ కూపంలోనికి
మీ చోటు ఉయ్యాలవద్ద
మీరు ఒక యింటి నట్టింటి దీపాలు
మీ రెందు కవుతారు పాతకాలపాలు"

ఇతగాని మాటల కిసుమంత నవ్వి
ప్రతివచన మొసగె వయ్యారి చపల...

"వెతికాం వెలుగురేకల కోసం
బతికాం మర్యాదా కోసం
వెచ్చదనం కోరుకున్నాము
పచ్చగా ఉండాలనుకొన్నాము"

అంతలో చంచల అందుకొని తమ
చింతల వంతల చెప్పసాగింది...

"వేడి లోపించింది
వెలుతురు లోభించింది
ఉద్వేగంగా బతకాలని
ఉద్రేకాన్ని వెతకాలని
త్వరపడి నరకంలో అడుగిడి
పొరపడి అక్కడే స్థిరపడి
నగరంలో నగరంలో నగరంలో
ఇళ్ళనుండి వెలువడి
సంకెళ్ళ నుండి విడివడి
ఫాషన్లకి లోబడి
ఎడారి నాగరికత బిడారుల జొరబడి
కుంటికాలు ఒంటెమీద
ఒంటె ఒంటిగూని మూపుమీద చతికిలపడి
పోతున్నాం ఎండమావుల తియ్యమావికోసం
పోతున్నాం పొగాలపు మేఘాలమీదను"

చంచల ప్రకటించు సంక్షోభ శోభ
పంచుకొని చపలపలికె తా నిట్లు...

"చిందర వందరల
మందకొడి జీవితం రుచించ లేదు
సుందరత ఎక్కడో
ఉందనుకొని పోతున్నాం మేము

ఆపుతున్నారు మమ్మల్ని తేపతేపకు
. . . పోనిమ్ము పుణ్యముంటుంది మమ్మాపకు."

విదలించుకొని వారు వెళ్ళిపోయారు
కదలి పాపులతోడ కలసిపోయారు
పాపాల కడలిలో పడుచున్న నదుల
రూపమ్ములను జూచి లోపల వగచి
మనవాడు సూర్యుడు మదిలోన మంట
జనియించ తానిట్లు సంతాపమొందె ...

"ఇది వినాశనానికి దారి
ఈ ట్రంకురోడ్డుమీద లేదు స్పీడు లిమిట్
దగాపడిన సుందరులు
కాలుజారిన సోదరులు
తెగించి నడుములు బిగించి వస్తారిటు
చిత్తమొచ్చిన ఆలోచనలమీద
సెన్సారు కత్తెరలకు
ఐడియాలమీద సి. ఐ. డీలకు
భావాలపై పోలీసులకు
ఎదురుతిరిగిన యువకులు
ఎందరెందరో వస్తారిటు
పసివాళ్లు ముసిలాళ్లు
పాడుచుకొని వస్తారు పడుచువాళ్లతో"

అంతలో వింతగా అతి వృద్ధుడొకడు
గెంతేటి బాలుని కేలూత గొనుచు

పాపాలశాలకు పయనించు దారి
చూపించ మనుట శ్రీ సూర్యుడు చూచె...

"విలాసానికి దారి ఇదేనా
కులాసాకి దారి ఇదేనా"

"రండి తాతగారూ
దాటేద్దాం నియమాల యేరు"

"రా కుర్రాడ
ఎక్కుదాం తిరుగుబాటు ఓడ"

"ఇటుఇటు
సరదాకి దారి ఇటు
బాధమరచి పోవడానికి మందొక్కటే
మనల్ని రక్షించ గలిగేది చీకటే"

"షోకులలో
సోమరిగా బతుకుదాం
నిస్సారమైన మర్యాదా మప్పితాలకన్నా
సారవంతమైన చెడ్డతనం మేలు"

"పదండి సరేసరే
పోదాం బలేబలే
ఈదారి నర్తనశాలకు
ఇది యథేచ్ఛావర్తనశాలకు"

"కుర్రాడా చెయ్యిగొంచెం యిర్వు"

"తాతయ్యా ముందడుగు వెయ్యి"

ఇట్లు మాట్లాడుతూ ఏతెంచి పోవు

జట్లు జట్లను చూసి సాగె సూర్యుండు...

"పోతున్నారు ఆడామగా చిన్నా పెద్దా

అంతులేని పాపాల ప్రాంతాలకు

అంతరాళ కరాళ గహ్వరాలకు

పోతున్నారు పోతున్నారు పోయారు

జీవితంలో ఓడిపోయారు

మంచినుండి వీడిపోయారు

అది విలయం

నైచ్యానికి నిలయం

భయంకర విలాస వలయం

అక్కడికి చేరుకొంటున్నారు

సాగివస్తారు విస్తారంగా వీళ్ళు

సాయంకాలపు దీర్ఘచ్ఛాయలవలె

భయం తమం సమంగా కలసినప్పుడు

ఊపిరి ఉల్లాసంగా పీల్చుదామని

దోపిడి కొంతసేపు మరచిపోదామని

ఆహ్వానిస్తాయి పాపపంకిలాల బిలాలు

అరుస్తాయి బేహారుల గొంతుకలు"

అనుచు సూర్యుడు తన ఆత్మలో దలుచ

వినిపించ సాగెను వింతగొంతుకలు...

''ఇచట ఆనందం కారుచౌక
రిపేరు చేయబడును మీ విరిగిన జీవననౌక
సినిమా రికార్డుల వేడివేడి సంగీతం
మీ సొట్టసరసాలు నడిచేందుకు ఊతం
కొద్దిగా తిమ్మిరెక్కితే చాలును
మీ హృదయాలలో ఆనందవిహంగం వ్రాలును
ఈ సాయంత్రానికి వృద్ధాప్యం రానేరాదు
ఈ మత్తు చీకటితొలగి యిక తెల్లవారదు
ఇచట క్రొత్తడులు సైతం పాలుకారు కన్నెలు
చూడండి మసకమసక కన్నులతో ఈ వన్నెలు
మతిపోయిన నాట్యాలునుచేసే షోకిల్లాలకు
పట్టండిమీరు సత్తువలేని కాకిబంగారు పల్లకీలు
ఆగడాల కాగడాలు వెలిగిస్తామిక్కడ
ఇది వాలిపోయిన పాలిపోయిన అందాల అఖాడా
ఇది నిత్య మిథ్యా సంధ్య''

సూపరుసానిక్కు క్షుద్రోక్తివంటి
పాపాల వాణిజ్య ప్రకటన విన్న
సూర్యుడు తనలోన క్షోభించి, చెడ్డ
చర్యలు కడుమంచి జనులు చేయంగ
కారణమేమిటో కనుగొన దలచి
తారుణ్య హృదయాన తర్కించసాగె...

''ఎంత పతనం ఎంత పతనం
సతమత మవుతున్నారు సరదాల కొరకు

హతమవుతున్నారు ఆనందంకోరకు
మీనాలమీద తేనెలు తుచ్ఛసుఖాలు
ఆనందో బ్రహ్మమంటూరు తింటూరు పాపాన్ని
ఈప్సితాలకి సంతృప్తిలేక
కామితాలకి మితిలేక
మనస్సుకి ప్రశాంతిలేక
మాతృశ్రీలు కావలసినవారు
వీరపత్నులు వీరమాతలుగా అవవలసినవారు
చదువుకొన్నవారు చదవేస్తే ఉన్నమతి పోయినవారు
భవిష్యత్తుని లాలించవలసినవారు
వర్తమానాన్ని పాలించవలసినవారు
వెర్రితలలు వేస్తూ
నాగరికత పేర పిచ్చిపోకడలుపోతూ
ఎంతపతనం
యువకులు జాతి వెన్నెముకలు
ఎంతగూనిగా నడుస్తున్నారు
ఆరముగ్గిన ముసలివాళ్ళు
పిచ్చిపిచ్చని పిల్లవాళ్ళు
అందరూ క్షణికభోగ పరాయణులవుతున్నారు
ఏమిటి దీనికి కారణం
ఏమిటి సంస్కరణకు సంస్కరణకు సాధనం"

అపుడు సూర్యునివద్ద అవతరించినది
అపురూపమైనట్టి అతిలోకరమణి

సుశ్రావ్య మంజుల సూక్తుల పలికి
విశ్రాంతి నిచ్చెను వేడివేదనకు...

"చెప్తాను జవాబు దీనికి అభి
శప్తులు ఈ యుగంవారు
జీవితంలో సౌఖ్యం వాంఛనీయమైనా
సౌఖ్యమే జీవితం కాదు
బతకడానికి తిండితినాలిగాని
తినడానికే బతుకుతారు వీళ్లు
జీవన ఫలమందదు వీరికి
అందిఅందినచో సమస్యలుండ వెవరికీ"

అక్కాంత సందేశ మాశయసిద్ధి
దిక్కని మదిలోన తెలిసినవాడు
అసదృశ్యరూపమ్ము నరసినవాడు
పసితనమ్మున జ్ఞానివలె పల్కినాడు...

"ఎవరమ్మా నీవు
నిజాన్ని వచించావు
తల్చుకొన్న రూపంతో
పిల్చినట్లు వచ్చి నిల్చున్నావు
పోల్చుకున్నాను పోల్చుకున్నాను
కల్చరు మూర్తీభవించినదానివి
నీవు శాంతివి
అమందానందకరమూర్తివి
నిర్మల శుభ సౌఖ్యనియతివి

నిశ్చల విజ్ఞాననిరతివి
నీవు శాంతివి
ఎటుల పతితుల నుద్ధరించుట
ఎటుల దేశాన్ని బాగుచేయుట
సెలవిమ్మా అమ్మా
నీవు శాంతివేకద, ఈ
అశాంతులకు అభాగ్యులకు
నీ చల్లని దీవన లిమ్మా''

అని వేడు మనవాడి అభ్యర్థనము
విని శాంతి తా సెలవీయ సాగింది...

''నా దీవనలు సులభసాధ్యములు కావు
అయిననూ అందుకు
మార్గము లభేద్యములు కావు
జీవన ఫలాన్ని సాధించి దేశాని కందిమ్ము
అది నాకు నైవేద్యము కానిమ్ము''

అనిచెప్పి తానదృశ్యమవ రెండు
కనులందు నీరితో కలువరించాడు...

''అవకు అవకు అంతర్థానం
మమ్మల్ని చేయ కధ్వాన్నం
వెళ్ళి పోకు శాంతి
కలిగించకు మాకు భ్రాంతి

వెడలిపోయింది వీడిపోయింది శాంతి

ఇపుడేమిటి? ఏమిటి? ఏమిటిగతి?
ఎలా తొలగుతుందీ దుర్భరస్థితి''

రాజకీయ నసంద రమణీయమూర్తి
తేజోవిలాసాని తీయని గళము
వినిపించ కనుపించె విహ్వాలు పైన
మనవాడితో నామె మాట్లాడె నిట్లు...

''ఉన్నానుగా నీతో నేను
అవుతాను నీకు చేదోడు వాదోడు
అలసట అన్నదే లేక
కలసి మెలసి పనిచేద్దాం
చేద్దాం నాడుని కాంతివంతం
చూద్దాం కలకాలవసంతం
సమష్టి జీవన సౌఖ్యం
శ్రమైక జీవన సౌదర్యం
అందరి కోసం ఒక్కడు
ఒక్కడి కోసం అందరు
నలుగురితో నారాయణ
పనుగురాడు మాట
నియమాలకి లోబడడం
నియంతకు కట్టుబడడం
కొంతసేపు శ్రమించడం
పిదప విశ్రమించడం

కలలు నిర్మించడం
కళలు సృష్టించడం
ఇదే సంపూర్ణ జీవన ఫలం
అపుడు మానవులం దేవతలం

పాలకడలి, నగం, పన్నగం, కూర్మం
చెలరేగిన హాలాహలం
తలపోసిన వీడేర్చే ద్రుమం
కలకాలం బ్రతుకిచ్చే స్రవం సవం
అన్నీ నాలోనే ఉన్నవి
మథించ మంటున్నవి

జీవితం శాశ్వతమథనం
తుదలేని కథనం
తెద్దాం అమృతాన్ని
ఇద్దాం అందరికీ
కలసిమెలసి పనిచేద్దాం
అలసట అన్నదేలేక''

రాజకీయ నసంద రమ్మన్నక్షణమె
మోజుపడి తన ఆమోదమ్ము తెలిపి
ఆమెతో జీవించె నహరహమ్మతడు
శ్రామిక స్వర్గాన్ని సాధించదలచె
జనియించుచున్నట్టి జ్వాలలనార్పి
తనలోన తానుగా తర్కించ సాగె...

"వీలుపడనిదంటూ ఏమీ లేదు
మేలుపనులు చేయడానికి
అవాంతరాలు అనేకం రావచ్చు
నిరుత్సాహపడకూడదు
నిర్భయస్తులని ఆశవీడదు
ఆశయం గభీరమైతే
జీవితం గంభీరమవుతుంది
దున్నుతా హృదయ క్షేత్రాలని
జల్లుతా చేతనాల విత్తనాలని
ఆశయాలను ఆవహింపచేసి
సాధిస్తాను జీవనఫలాన్ని
అందిస్తా నది కోటి కోటి
నిర్భాగ్యజనులకు
పామరులను సోమరులను
అమరులుగా మారుస్తాను"

అనుకొని ఆఫల మందిన దనుచు
జనులను పిలిచాడు సాభిమానముగ
రాజకీయ ననంద రాజ బెట్టంగ
ఓజస్సు వెలగ నవోద్గీథపాడె...

"రండి ఇటురండి చూడండి
మీకోరకు తెచ్చాను జీవనఫలము
పడిపోయిన చెడిపోయిన

పతనమైన సోదర సోదరీమణులారా
నా అనుంగు జనులారా ఇందండి''

అను చాత డెలుగెత్తి అరచుట చూసి
జనులు హోరెత్తారు సాగరమల్లె
సుస్నేహశిలలపై సూటిగాపడుచు
ప్రశ్నాతరంగాలు పలుమార్లు విరిగె...

''జీవనఫలం జీవనఫలం
ఏమిటిది? ఏమిటీ ఇంద్రజాలం?
కష్టపడకుండా సుఖించే మార్గమా
మృష్టాన్నభోజనానికి సమానమా
ఇష్టసిద్ధికలిగించే విధానమా
సుష్టుగా పుష్టిగా బతికే సిస్టమా?

—గతజలాలను మరలించగలదా?
హతాశయులను లాలించగలదా?

—ఎండిపోయినఎడారి పండించగలదా?
గుండెలలో సంతృప్తి నిండించగలదా?''

అనిపల్కువారల కాతడిట్లనియె
మనసులో నెటువంటి మర్మములేక...

''ఇది సార్థకజీవనానికి సంకేతం
మానవత్వానికి సచేతన కేతనం
మంచితనానికి మెదడున్న నికేతనం

ఇది ధర్మార్థ కామమోక్షాల సంక్షిప్తరూపం
నిజమైన జీవితంయొక్క పరమార్థం''

అతను చెప్పినమాట హర్షించలేక
శ్రుతిమించి అడిగారు సూటిగానిట్లు...

—ఎవడికికావాలి వేదాంతం
అనుక్షణం కావాలి మాకు సుఖాంతం

—మీరిచ్చే జీవనఫలం
నన్ను పేకాటలో గెలిపిస్తుందా?
నా దరిద్రం బట్టతలమీద
సిరుల కురులు మొలిపిస్తుందా?

—మీరిచ్చే జీవనఫలం
షేర్ మార్కెట్టు ఫలితాలను సూచించగలదా
ఇన్ కమ్‌టాక్స్ ఎగేసేందుకు
అపాయంలేని ఉపాయాలను యోచించగలదా?

—నాకు యఫ్, ఎస్, గా సినిమా చూపించగలదా?
నేను రాయని పరీక్షల్లో మార్కులు వేయించగలదా?

—ఎగిరిపోవని యౌవనాన్ని
విరిగిపోవని స్వప్నాన్ని
సాధించగలదా ప్రసాదించగలదా?

—వింత వింతవగలు
నాజూకు నగలు

నాగరికత విలువలు
నాకు కావాలి

—బాధ్యతలు లేనిహక్కులు
చెల్లే బ్యాంకు చెక్కులు
నవయౌవనం మత్తు
నాకు కావాలి,

ప్రజలు కోరేదాన్ని ప్రామిస్సు జేయ
హెజిటేటు చేశా డహీనచిత్తుండు
రాజకీయననంద ప్రామిస్సు జేపి
మోజుపడు జనుల మోసమ్ము జేసె

పాక్షిక తత్త్వాల పరమార్థ మెరిగి
మక్షిక మవ లేక మనవాడు లూత
కుక్షింభరత్వాన్ని కొనియాడ లేక
పక్షిలా ఎగిరేటి ప్రతిభయు లేక
రాజకీయననంద రంకులుచూసి
రోజువారీబాంకు రోసినపిదప
నిజముగా నెవరినీ నిందించ లేక
ప్రజలలో ఒకడిగా బ్రతుకదలంచి
తీవ్రవనినాదాలు తిర గేసితొడిగి
తా వ్రయ్యలైన హృదయము చేదాల్చి

సంజచీకటివంటి స్వగ్రామమనేడి
పంజరంలోనికి పరిగెత్తి పోయె
ఘూంకరించు చున్న వ్యాఘ్రము బారినుండి
తండ్రిచాటున తాను తలదాచుకొనెను...



౨

## తండ్రి

బెండకాయలు ముదరకూడదు
బ్రహ్మచారులు ముదరకూడదు
ఒంటరితనం అడవిలోపల
యౌవనం వెన్నెలలా వేస్టు కాకూడదు
పెళ్ళి యీడు కొడుకున్న తండ్రికి
రావలసిన కట్నం పోకూడదు
బెండకాయలు ముదిరినా ఫరవాలేదు
ఎండిపోతే వీధిలో పారెయ్యవచ్చు
లేతలేత కాయలు ఏరికోరి తెచ్చుకోవచ్చు
బ్రహచారి కొడుకు ముదిరితే నష్టం
పెళ్ళి చేసుకోరా అబ్బాయీ పెళ్ళి చేసుకో...

## కొడుకు

ఉదయించిన సూర్యుడు
పయనించవలసిందెంతో ఉంది
హృదయంలో భావాలు
పదను తేర వలె నింకా

నాయొక్క గతకాలంగారూ,
నాన్నగారూ! నన్ను బాధించకండి
వివాహం చేసుకోమని వేధించకండి...

తండ్రి

విశేషణంలేని పదంలాగ
వివాహం కాని జీవితం అసుందరం
వెన్నెలలేని ఇసుక తిన్నెలాగ
ఎన్నాళ్ళిలా ఉంటావురా అబ్బాయీ
నీ జీవిత ప్రవాహానికి
పెళ్ళామనే ఆనకట్ట అవసరం
నీ చీకటి బ్రతుకులోన
పెళ్ళామనే పెట్రోమాక్సు దీపం కావాలి
పెళ్ళి చేసుకోరా అబ్బాయీ-నా
కళ్ళు పెట్టి నీ సమస్యలు చూసుకోరా...

కొడుకు

ఎవరికళ్ళు వాళ్ళకి చాలు
ఎవరి ముళ్ళమీద
వాళ్ళే వడచుకోడం మంచిది
పెళ్ళి చేసుకొన్నాక కడగళ్ళ వడ
గళ్ళెందుకు? ఎవరి గడియారం
ముళ్ళని వాళ్ళు నమ్ముకోడం మంచిది
నా జీవిత ప్రభాతంలో
పదిగంటలైనా కాలేదింకా
అప్పుడే తొందరెందుకు నాన్నగారూ
ఇప్పుడే చిందరవందరెందుకు? చికాకెందుకు?...

తండ్రి

ఆకాశాన్ని చూడు, అందులోని
అనేకానేక నక్షత్రాలని చూడు
పుస్తకాలని చూడు వాటిలోని
ఒకే ఒక్క సలహాని పఠించు
ద్వంద్వసమాసంలో ఎంత అందం
ఉందో ఆలోచించి పరికించు
బండికి రెండు చక్రాలుండాలి...

కొడుకు

రెండే అన్నమాటేమిటి!
రెండురెళ్ళు నాలుగు చక్రాలుండొచ్చు
మూడు చక్రాలబండి ముచ్చటగా
చూడచక్కగా ఉంటుంది...

తండ్రి

ఒప్పుకొన్నావా! బండికి చక్రాలు ముఖ్యం
తప్పుచెయ్యకు; ఆడవాళ్ళతో చేయిసఖ్యం
నీకూ నాకూ ఎందుకురా వివాదం
ఏ కులీనుల పిల్లనో చేసుకో వివాహం...

కొడుకు

వివాహం ఆహవం రెండూ ఒకటే...

తండ్రి

అదే...అదే...జీవితం
పదే పదే చెపుతున్నది

ఘర్షణలోనే ఉన్నది ఆకర్షణ
సంఘర్షణలోనే జనిస్తుంది సంతోషం
భిన్న ధ్రువాలు ఎంత విరుద్ధమైనా
ఉన్నవిధంగా ఉండడానికి అవి ఆవశ్యకం
ఆదినుంచి నేటిదాకా ఉపమానంగా
ఏదైనా తీసుకో! జంటలు ముఖ్యం...

కొడుకు

నిజమే నాన్నగారూ
జీవితం రేడియో సెట్టుకి
భర్త ఏరియల్ భార్య ఎర్తు
రెండూ ముఖ్యమే గాని
నా జీవితంలో అంత నిరుపష్టమైన
ప్రసారం అక్కర్లేదు
నా జీవితానికి ఎంత
వాల్యూము కావాలో నాకు తెలుసు
నాకు కావలసిన సఖురాంద్ర
ప్రేమను నేను వెతుక్కోగలను
ఏ మోటర్ బాండులో
నేను కోరుకొనే ఏకైక సఖి
దొరుకుతుందో నాకు తెలుసు
నా ఆనందం నేను చూసుకోగలను...

తండ్రి

నువ్వు కోరుకొన్న సంగీతం
నీ ఒక్కడి చెవులకే ఆనందం
నువ్వు వేసుకొన్న చిత్తరువు

నీ ఒక్కడి కళ్ళకే ఆశ్చర్యవు
నీ జన్మకి కారకుణ్ణి
నీ మెదడుకు మెకానిక్కుని
నీ ఊపిరికి పరబ్రహ్మని
నీ ఆనందానికి నేనే
వ్యాసకర్తనైతే బాగుంటుంది
నువ్వు ఆనందించడానికి
అప్పుడే కొంచెం వీలుంటుంది
ఇప్పుడు ముగ్గురు విలాసినులొస్తారు
ఇప్పుడు ముగ్గురు విలాసినులొస్తారు

కొడుకు

ఒడ్డు లేని నదికి
అడ్డం లేదు
ఎత్తు మీద ఉన్నవాడు
ఎటువైపైనా చూపు తిప్పవచ్చు
అవిటివాడు ఆకాశగంగదగ్గరికి
చెవిటివాడు నాదబ్రహ్మ స్వరాలు
వెళ్ళలేదు, వినలేదు
నాందీగీతం పాడకముందే
నాటకం తెర ఎత్తకూడదు
గొంతుక సరిచేసుకోకుండా
శ్రుతిలో పాట పాడలేను, నా
అభిప్రాయాలకి ప్రాయం రాకముందే
వివాహం చేసుకోలేను...

తండ్రి

నీ యౌవన జీవన నాటకానికి
ఫస్టుబెల్లు కొట్టారు. నీకేది
బెస్టో నాకు బాగా తెలుసు
ఇప్పుడు ముగ్గురు విలాసినులొస్తారు
నీ జీవితంలోకి వింతకాంతులు తెస్తారు
నీకు నచ్చిన కిరణాన్ని ఎన్నుకో...

కొడుకు

రామాయణం పఠించాను నాన్నగారూ
రాముడికి సీత ఏమవుతుంది చెప్పండి
నా జీవిత ప్రభాతంలో ఇంకా
పది గంటలైనా కాలేదు
ఇప్పుడే ఎందుకింత తొందర
అప్పుడే ఎందుకీ బాదర బందీ ?
అప్పుడే పెళ్ళి పంజరంలో
నా మనఃకీరం ఎందుకు బందీ...

తండ్రి

బెండకాయలు ముదరకూడదు
బ్రహ్మచారులు ముదరకూడదు
ఒంటరితనం అడవిలోపల
యౌవనం వెన్నెలలా వేస్టుకాకూడదు
పెళ్ళియీడు కొడుకున్న తండ్రికి
రావలసిన కట్నం పోకూడదు
ఇక్కడికి ముగ్గురు విలాసినులొస్తారు

వాళ్లు ఎంతెంతో కట్నం తీసుకొస్తారు
నీ చేతిలో ఈ మలాకా జాంపండు పెడుతున్నాను
నీకు నచ్చిన కన్యకది బహూకరించు
నీకు నచ్చిన ఆనందాన్ని ఏరుకో
నీ జీవిత భాగస్వామినిని ఎంచుకో
నీవు మెచ్చిన కన్యకి ఫలప్రదానం చెయ్
ఆ అమ్మాయిని నీకిచ్చి...

సేవకుడు

...ఎవరో వొచ్చారండి
కవటాకుల్లో ఈ సెల్లాంటి వోళ్లు
రివటల్లాంటోళ్ళు సీతాకోకసిలకలు
అప్పా సెల్లెళ్ళలాగున్నారు
ఆరతి కర్పూరంలాగున్నారు
ఆళ్ళతో ఆళ్ళ అయ్యగార్లొచ్చారండి
ఇద్దరూ రెండు ఇనప్పెట్టెల్లాగున్నారండి

తండ్రి

• లోపలకి పంపించు ! ...వారికి ఈ
గదిలోకి దారి చూపించు, మధ్యనున్న
తెరలు తొలగించు. ఒక్కొక్కర్నే
తండ్రితో పంపించు

కొడుకు

ఇప్పుడే ఎన్నుకోవాలా నా వధువుని
నేను ఇప్పుడే పుచ్చుకోవాలా కాలకూట మధువుని

తండ్రి

జాగు చెయ్యకూడదు
ఆ ఇద్దరిలో ఎవరినో ఒకరిని ఎంచుకో
ఆలస్యంగా ఉదయించే తారకలాగ
లేటుగా వస్తుంది మూడవ అమ్మాయి
వీళ్ళిద్దరూ నచ్చకపోతే
ఆ మూడవ అమ్మాయినే వరించు
నీ చేతిలో పండు మట్టుకు జాగర్త!

కొడుకు

ఇన్ని వసంతాలు భార్యలేకుండా జీవించాను
ఇంకో ఇన్ని వసంతాలు బాధలేకుండా జీవించగలను
కుమారుడు జన్మించినప్పుడే
తండ్రి వాడికి కఠిన శిక్ష విధిస్తాడు
పెళ్ళిచూపుల తతంగంతో
ప్రారంభమవుతుంది శిక్ష
తప్పించుకోడానికి చూస్తాను గాని
తప్పదంటే భరిస్తాను
ఎవరో ఒకర్ని వరిస్తాను.

తండ్రి

మంచిదిరా అబ్బాయి మంచిది
రండి...రండి...నమస్కారం

శ్రీమంతుడు

నమస్కారం, ఈమె మా అమ్మాయి
ప్రత్యూష పవనాలలో ఊగాడే
నిత్యమల్లి పూవులాంటిది

తండ్రి

ఔనౌను, ఇతడు మా అబ్బాయి
తుఫాను వచ్చేటప్పుడు రేగే
సుడిగాలిలాంటివాడు
మచ్చిక చేసుకొంటే మట్టుకూ
మలయపవనం లాగ మారగలడు

శ్రీమంతుడు

ఔనౌను, నమస్కరించవమ్మా
వీరికి నమస్కరించు

ఒకటవ అమ్మాయి

నమస్తే, నమస్తే
పునస్తే పునస్తే

తండ్రి

విధాత సృష్టించేటప్పుడే
వివాహాలు నిర్ణయించడం కద్దు
మా అబ్బాయి జీవితం పజిల్ కి
మీ అమ్మాయి కీ సొల్యూషన్ కావచ్చు
మా అబ్బాయి పయనిస్తున్న మార్గానికి
మీ అమ్మాయి గమ్యస్థానం కావచ్చు
మీ అమ్మాయి అడుగుతున్న ప్రశ్నకి
మా అబ్బాయి సమాధానం ఏమో, బహుశా,
మీ అమ్మాయి కల్యాణవిద్యుద్దీపానికి
మా అబ్బాయి స్విచ్చికాబోలు

ఇద్దర్నీ మాట్లాడుకోనియ్యండి
హృదయాలు వెతుక్కోనియ్యండి

శ్రీమంతుడు

అలాగే అలాగే
అమ్మాయి ఆస్తి వివరాలు చెప్పాక
అలాగే కానిద్దాము
మా ఐశ్వర్యప్రవాహంలో
పదహారుమంది బంధువుల
చరాస్తులు ఉపనదులు
స్థిరాస్తులు సారవంతమైన లంకలు
మా అమ్మాయి తనతల్లి యొక్క
పెద్ద పెద్ద సొసైటీభావాలకి వారసురాలు
లేడీస్ క్లబ్ కార్యకలాపాలకి నాయకురాలు

తండ్రి

చిత్రం, మా యింట్లోనే నేలమాన్యంలో
మొత్తంమీద ప్రపంచంలోని
అత్యద్భుతమైన మాట్లాడే
చచ్చిపోయిన చిలుక ఉంది
తమరు ఇటు దయచేస్తారా
ఆ వింత గమనిస్తారా !...
అబ్బాయీ! అమ్మాయితో మాట్లాడుతూఉండు
ఆమెకి బహూకరించుమలా కాజాంపండు
...ఇప్పుడే వస్తాను...ఇప్పుడే వస్తాను.

కొడుకు

(గొంతుక సవరించుకొంటాడు)

ఒకటవ అమ్మాయి

నిశ్శబ్దం భరించలేను నేను
నిశ్చలతని సహించ లేను

కొడుకు

ఇంకా ఏమేమిటి సహించలేరు
ఏ తత్త్వాలను భరించలేరు

ఒకటవ అమ్మాయి

స్వంత బంగళా స్వంత కారు
కొంత ఆస్తి వింత ఫర్నిచర్
సుంతైనా లేనివాళ్లని క్షమించలేను
టెలిఫోను నెంబరు లేని జీవితాలని
బాంక్ ఎకౌంటులేని బ్రతుకులని
తక్కువ జీతగాళ్లని
ఎక్కువ శ్రమ పడేవాళ్లని
ఎన్నడూ సహించలేను
చిరిగిపోయిన బట్టలవాళ్లని
మాసిపోయిన జుత్తులవాళ్లని
రోడ్డుమీద బిచ్చగాళ్లని
ఎలా సహించగలం చెప్పండి
ఏమంటారు ? ఏకీభవిస్తారా ?

కొడుకు

పాపం ? మీకేదంటే ఇష్టం ?
ఏదిచూస్తే ఇంతకన్నా కష్టం

## ఒకటవ అమ్మాయి

ఈతల చెరువు గట్టుమీద
ఇంద్రధనుస్సు రంగులగొడుగులకింద
కూల్ డ్రింక్స్ తాగుతూ
కులాసాకబుర్ల కన్నా ఏం కావాలి ?
ఖరీదైన విదేశీ పెంపుడు కుక్కలకి
ఖరీదైన విదేశీ బిస్కెట్లుపెట్టి పెంచి
శునక ప్రదర్శనంలో పాల్గొని
సాటి సాంఘిక విలాసినుల కరతాళధ్వనులలో
మొదటి బహుమానం పుచ్చుకొని
పెంపుడుకుక్క తోలు పటకాని
సుతారంగా పట్టుకొని సున్నితంగా
నడవడం కన్నా ఆనందమేముంది ?

కొసుకు

ఖరీదైన ఆడవాళ్ళ భర్తలు
ఖరీదైన పెంపుడు కుక్కలు
క్లబ్బులలో, కాఫీహౌసులలో
కళ్ళు మూసీ మూయకుండా
తెరచీ తెరవకుండా
సారాంశంలేని విషయాలు
నిష్ఫలితంగా చర్చిస్తూ
ధనాన్నీ క్షణాలనీ కాలుస్తూ
పనిపాటల్ని నిరసిస్తూ
గోలగా డొల్లగా బతుకుతారు
ఆ సభ్యత నాకు తెలిసినా చేతగాదు
మీ భర్తగా ఉండే యోగ్యతలు నాకు లేవు

## ఒకటవ అమ్మాయి

అందమైన ఆర్టుపేపరు మీద
అందమైన ఫొటోలు అందంగా ప్రచురించే
అందాల పత్రికలో పడదలచుకొన్న
అందాల రాణికి అనువైన భర్త కావాలి
శ్రీమతి శ్రీయుత ఫలానా దంపతులు
ఫలానా ఫలానా పెద్దపెద్ద వాళ్లకి
ఫలానా ఫలానా గొప్ప గొప్ప వాళ్లకి
చేసిన విందులో తీసిన ఫొటో
ఎడమనుంచి కుడికి
నడుమనున్న నవ విలాసినిగా
నా పేరు నాగరికతకి మారుపేరు
గుర్రప్పందాల రోజున
విర్రవీగే సాటి ఆడవాళ్ల వీపుమీద దెబ్బలాగ
రేసుకోర్సులో సరికొత్త ఫాషన్లు
ప్రవేశపెట్టే నవీన స్త్రీగా
నా రూపు సింగారానికి కనువిప్పు
చీకూ చింతాలేని జీవితం టెన్నిస్ కోర్టులో
తీరుబాటు రాకెట్ విలాసం బంతి
అలసి పోకుండా అతి సున్నితంగా
ఆడడం నా ఆదర్శం

## కొడుకు

ఎవరెస్టు ఎక్కడం సులభం
అతి సామాన్యులకి అందరాని
ఆదర్శ పర్వత శిఖరాల చుట్టూ

అర్థంలేని అర్థంకాని అభిప్రాయాలు
నీటి మేఘాలు అభిలాషలు పొగమంచు
మీరు నోరు తెరవకముందూ
మీకీ మలాకా జాంపండు
ప్రెజెంటు చేద్దామనుకొన్నాను
సున్నితమైన బురదలో
సుతారంగా జారేవాళ్ళు
కాంక్రీటు రోడ్డుమీద
కాంక్రీటు భావాలతో నడువలేరు
ఏబ్‌స్ట్రాక్ట్ ఆదర్శాలలో ఈదేవాళ్ళు
యాబ్‌సెంటీ లేండు లార్డులకన్నా మంచివాళ్ళు
మా నాన్నగారితో మీ నాన్నగారు
మా నేల మాన్యంలో గుప్తం చేయించబడ్డ
నిత్యం ఊపిరి పీలుస్తున్నా
అత్యద్భుతంగా చచ్చిపోయిన
మాట్లాడే చిలుకతో మాట్లాడుతున్నారు
మీరుకూడా వెళ్ళిచూడండి
దాని స్వరపేటికని తణిఖీచేయండి

ఒకటవ అమ్మాయి

పురాతన వస్తువులు ప్రదర్శించడం
అధునాతన స్త్రీలవ్యామోహం
నేల మాన్యంలోకి మెట్లున్నాయా
గాలి వెల్తురూ ఉంటాయా

కొడుకు

ఆధునిక రంగేళీ యువతుల
ఆఘునిక ఆదర్శాలలో కన్నా

ఎక్కువగాలి మిక్కిలి వెలుగు
నేల మాన్యంలో బాగాఉంటాయి
దారి ఇటువైపు
నేరుగా వెళ్లండి...
...అమ్మయ్యా !
బండికి రెండు చక్రాలు కావాలట
రేడియో సెట్టుకి ఏరియల్ ఎత్తూ ఉండాలట
సూర్యుడి రథానికి ఒకటే చక్రం
భార్యా భర్తల ఎత్తూ ఏరియల్సున్నా
ఏకాభిప్రాయం అనే విద్యుచ్ఛక్తి
లేకపోతే సెట్టు పలకడం సున్నా
నిశ్శబ్దాన్ని సహించలేని స్త్రీతో మాట్లాడడంకన్నా
నిరంతరం హోరెత్తే నీలికడలిని
చూస్తూ కూర్చుంటే దొరుకుతుంది రెస్టు
ఆ పిల్లని పెళ్ళాడడం కన్నా
ఆ సముద్రంలో పడిపోవడం బెస్టు
ఒక అందమైన ఆడపిల్లయొక్క
అందవికారమైన భావాలు చూశాను
బయట నాకోసం కాచుకొనే రెండోపిల్ల
నేను జీవితంలో కాచుకొని ఎదురు
చూసే పిల్లేమో చూద్దాం
అయితే ఆ పిల్లకే పండిద్దాం
గంట కొడితే సర్వెంటు పలుకుతాడు

(గంట కొడుతాడు)

సేవకుడు

ఏం బాబూ !
దొరికిందా మీ ప్రశ్నకు జవాబు ?

కోడుకు

సేవకా! నా కల్యాణ నౌక నావికుడవుతావా
ప్రశాంతమైన ప్రకృతిలోకి
పరిభాతాన్ని ప్రవేశపెట్టే
కోడిపుంజు లాంటివాడా! ఆ
ఆడపిల్లని ప్రవేశపెట్టు

సేవకుడు

నాన్నగారు రావద్దా బాబూ
పెద్దోళ్ళు సెప్పందే పెళ్ళిసూపులు
పద్దాలులేని నాటకంలా ఉంటుంది.

కొడుకు

ప్రజాస్వామిక సూత్రాల ప్రకారం
ప్రతి యువకుడు తన పార్ట్నర్ని ఎన్నుకోవచ్చు
ప్రవేశపెట్టు, ప్రవేశపెట్టు

సేవకుడు

సిత్తం

కొడుకు

నీళ్లులేని నదిలో
మొసళ్ళుంటాయా
నీళ్ళులేని నదిలోని పడవకి
తెరచాప అనవసరం
ఆనందానికి వీలులేని జీవితంలో
అర్థం చేసుకోలేని భార్య దండుగ
నీళ్ళులేని నదిలో।
తాబేళ్ళు ఏమౌతాయి?...

రెండో అమ్మాయి

నమస్తే !
క్షమిస్తే చెప్తాను
మా నాన్నగారు అర్జంటు పనిమీద
అర్జెంటుగా వెళ్ళారు
అర్జెంటుగా ఎవర్నో మోసం చేయాలట

కొడుకు

వ్యాపారానికి విశ్వాసం, వినియోగం
సహజంగా ఉండే చేతులు
యాంత్రిక నాగరికతలో
కుతంత్రాల చక్రాలలో
వ్యాపారపు సహజ హస్తాలు విరిగిపోతే
మోసం, స్వార్థం దానికి కొయ్యచేతులు
పుట్టుచేతులులాగ కనబడే పెట్టుడు చేతులు
మీ నాన్నగారు వ్యాపారస్థులైతే
మోసం చెయ్యడం వారి జన్మహక్కు

రెండో అమ్మాయి

టెలిఫోనుమీద ప్రపంచాన్ని బేరం చెయ్యడం
టెలిగ్రాంమీద సమస్తాన్ని అమ్మివేయడం
వస్తువులు లేకుండా వ్యాపారం చెయ్యడం
చూస్తూఉండగా కోటీశ్వరుడు
విసుపోయేలోపున లేకి బికారి
ఆధునిక వ్యాపారం అంటే నాకిష్టం
అందులో నావాళ్ళకి మాత్రం రాకూడదు నష్టం

కొడుకు

కొండమీద పడి విరిగినా
కొండంత ధైర్యంగల తరంగంలాగ
కనబడుతున్నారు మీరు
మీ మనస్సు ఎంతదృఢమైనది
మీ భావాలెంత గాఢమైనవి
మీ నాన్నగారు మోసగించడానికి
అర్జెంటుగా వెళ్ళారని
అతి ప్లెయిన్‌గా చెప్పారు
మీ మెదడెంత నిష్కల్మష మైనది
మీకీ మలాకా జాంపండు
ఇవ్వాలని ఉంది

రెండో అమ్మాయి

సమాన హోదా గలవాళ్ళ మధ్య
ప్రమాద మేముంటుంది నిజంచెప్తే
మీరిస్తున్న ఈ పండు బాగు లేదనుకుంటాను
మీ రిస్తున్నారు గనుక తీసుకుంటాను
మా నాన్నగారు వ్యాపారంలో
లోకాన్ని మోసం చేస్తునట్టు
తెచ్చిపెట్టుకున్న విశ్వాసాలతో
అరువు తెచ్చుకొన్న భావాలతో
అతి మర్యాదగా జీవించడం నాకిష్టం

కొడుకు

అంటే అర్థం చెప్పండి
అసలు అర్థం వుంటే !

రెండో అమ్మాయి

ఎన్నడూ తలుపులు తెరవని బీరువాలో
ఎవ్వరూ తెరచి చూడని పుస్తకాలు
ఎప్పుడూ తరచి చూడని ఇజాలు
మా యింట్లో మేజాలమీద మేలైన కూజాలు
నాజూకైన చీరలు కట్టుకోనడం
నాజూకైతే అవే ధరిస్తాను
ముతక ఖద్దరు చీరలు కట్టుకొని
వోటింగ్‌కి వెళ్ళడం దేశభక్తి అయితే
అవశ్యం అదే చేస్తాను
మనసులోని విషయాలు
మనసులోనే దాచుకోవడం మర్యాదాకానప్పుడు
మనసుపైకి తీసుకొస్తాను
నా ఊహలు కారులో పోవాలంటే పోతాయి
కాలి నడకని సాగమంటే సాగుతాయి

కోడుకు

గాలికోడి గాలివాటాన్ని చూపెడుతుంది
గాని వేకువని తెలియచెయ్యదు
నీరు పల్లానికి పారుతుంది గాని
నిలువ నీరు మంచిది కాదు
పొరపాటున మీకు మలాకా జాంపండు ఇచ్చాను,
అది నాకు ఇచ్చెయ్యండి ఈ
యాపిలుపండు తీసుకోండి

రెండో అమ్మాయి

మీరు ఏఫలం స్వీకరించమంటే
అదే స్వీకరిస్తాను

మా నాన్న ఎవర్ని వరించ మంటే
వారి నే వరిస్తాను

కొడుకు

మా నేల మాన్యంలో
మా నాన్నగా రున్నారు
అతి పురాతనమైన వస్తువులు
అతిథులకు చూపిస్తున్నారు
వాటిని పరికించడమే
నేటికి శేషను

రెండో అమ్మాయి

ఆదే శేషనైతే
అవశ్యం చూస్తాను
దారి ఎటు ?

కొడుకు

ఇటు...ఇటు...
అభిప్రాయాలు లేనివాళ్ళని అర్థం చేసుకోవచ్చు
ఆశయాలు లేనివాళ్ళని జీవించడానికి అనుమతించవచ్చు
ఏయెండ కాగొడుగు పట్టేవాళ్ళని
ఎన్నడూ క్షమించలేము

( గంట కొడుతాడు )

సేవకుడు

బాబూ! ఏం సెలవు ?

కొడుకు

సెలవుల్లేని ఉద్యోగంలాగుంది నా మనస్సు
ఏదీ ఆమూడో అమ్మాయి

ఏదీ ఈ పండుపుచ్చుకొని
నా జీవితాన్ని పండించే ఆషాఢ మేఘం

సేవకుడు

ఎవరూ రాలేదండి
బయ్యటెవరూ లేరండి

కొడుకు

నాన్నగారు ముగ్గురొస్తారని చెప్పారు
ఇద్దరు నా పరీక్షలో తప్పారు
ఏదీ ఆ మూడో అమ్మాయి
ఏదీ నా ఊహాసుందరి

సేవకుడు

ఇంకా రాలేదండీ
చినబాబుగారూ! ఆకలేస్తోంది
ఆ పండు నాకిస్తారా అండీ

కొడుకు

ఇది పండుకాదు
నా హృదయం
ఇది ఆకలి తీర్చదు
కోరినది సమకూర్చదు
సేవకా! నీ వెందుకు
ఐంద్ర జాలికుడవు కాకూడదు
నే కోరిన కన్నియ
నెందుకు తీసుకు రాకూడదు
ద్వారబంధం ముందు నిలబడు
రాగ బంధాన్ని తీసుకురా

సేవకుడు

సిత్తం

కొడుకు

ప్రయాణం మొదలెట్టకూడదు
ప్రణయం గురించి తలంచకూడదు
ప్రయాణం మొదలెడితే
గమ్యాన్ని చేరుకోవాలి
ప్రణయం గురించి తలంచితే
ప్రేయసిని వరించాలి
కణకణలాడే వింతచీకటి
మనసునిండా ఆవరించింది
ఏ చంద్రముఖి నవ్వుల వెన్నెలతో
యీ చీకటి తెల్లనవుతుంది
ఏ పల్లవపాణి మృదుస్పర్శతో
ఈ హృదయం పల్లవిస్తుంది
తల్లడిల్లే ఊహలు చల్లబడతవి
నా భవిష్యత్తుని పంచుకొని
నాతో సమానంగా ఊపిరి పీల్చుకొని
నన్ను పరిపూర్ణుని చేయమని
నేను ఆహ్వానిస్తున్న సుందరి చిరునామా ఏమిటి ?
సాకీను ఏది ? సఖి ఎక్కడ ?

ఊహాసుందరి

నమస్కారం !

కొముకు

మీకు నమస్కరించడానికి
నాకు మనస్కరించడంలేదు
ఎవరుమీరు ? అయినా నమస్కరిస్తాను

ఊహాసుందరి

సెలయేటిలో పడివుండే
గులకరాయిని ఎవరునీవని
అడిగితే ఏమని చెపుతుంది
మసక చీకటిలో
రోజగాలిలో ఎగిరే
చిత్తుకాగితాన్ని ఎవరునువ్వని
అడిగితే ఏమని చెపుతుంది
ఆకాశంలో పల్టీలు కొడుతున్న
తెగిన గాలిపడగనీ
సరోవరంలో నీటిబుడగనీ
ఎవరు మీరని అడిగితే
ఏమని సమాధానం చెప్తాయి

కొముకు

సమాధానం రాకపోయినా
ప్రశ్నించడం సహజం
ప్రశ్నించాక జవాబు
రాబట్టడం నైజం
ఎందుకొచ్చారు ఇక్కడికి ?

ఊహాసుందరి

పుష్పం ఎందుకు వికస్తుందో
పుష్పానికి తెలుసునా

గాలి ఎందుకు వీస్తుందో
ఎవరికి తెలుసు
ఫ్యాక్టరీలలో చక్రాలలో చక్రం
తానెందుకు తిరుగుతుందో
తనని తాను ప్రశ్నించుకోనదు
తక్కిన చక్రాలతో పాటు
తను కూడా తిరుగుతుంది
తతిమ్మా చక్రాలు విరిగినప్పుడు
తను కూడా విరుగుతుంది

కొడుకు

సృష్టి ఎక్కడ మొదలైందో
దృష్టికి అందక పోవచ్చు
మీ జీవన ప్రయాణం ఏ స్టేషనులో
మొదలయిందో మీరు మర్చిపోయినా
ఇక్కడికి రావడానికి ముందు
ఎక్కడనుంచి బయలుదేరారు ?
ఇక్కడనుంచి మీరు
ఎక్కడికి వెళ్తారు ?

ఊహాసుందరి

చీకట్లో బయలుదేరాను
వెలుగులోకి వెళ్లాలనుకుంటాను
విరోధం నుంచి విడివడ్డాను
స్నేహంలోకి పోవాలనుకుంటున్నాను
ఒంటరిగా బయల్దేరాను
జంటను వెతుక్కోవాలనుకుంటున్నాను

నిన్నటిదాకా జైల్లో ఉన్నాను
ఇప్పుడే ఇలా వచ్చాను

కొడుకు

ఏమిటి మీరు చేసిన ఘోరం
ఏమిటి మీరుచేసిన నేరం ?

ఊహాసుందరి

అక్షరాలలో పరుషాలుండకూడదన్నాను
ఆశయాల బియ్యంలో అవరోధాల
మట్టి బెడ్డలుండకూడదన్నాను
చూపు తిన్నగా ఉండాలన్నాను
ఊపిరి పీల్చడం నేరం కాదన్నాను
ఉద్దేశాలు సవ్యంగా ఉండా లన్నాను
ఎరువు తెచ్చుకున్న భావాలని
ఎరువుగావాడి అభిప్రాయాలను పండించకూడదన్నాను.
అనాథగా అసహాయగా ఉండడం నా నేరాలు
అవనివాళ్లూ అయినవాళ్లూ నా జైలు

కొడుకు

మీరెవ్వరో నాకుడిచెయ్యిలాగున్నారు
నా ఎడమకన్ను మీరైతే ఎంతో బాగుంటుంది
నా హృదయం ఖాళీగానే ఉంది
అందులో మీరు-

ఊహాసుందరి

-చైతన్యం కావాలి జీవించడానికి; చలనంకావాలి.

కొడుకు

నా హృదయంలో చైతన్యపు గనులున్నాయి
నా మనస్సులో నిరంతర సంచలనం ఉంది
నా ఆలోచన జలపాతం
నా ఆవేదన అగ్ని పర్వతం...

ఊహాసుందరి

నా తెల్ల కాగితం మనస్సుమీద
కుదురైన అక్షరాలు రాసే వాళ్లెవరు
ఆ అక్షరాలకి అర్థం కల్పించేదెవ్వరు
నా హృదయం ఫిడేలుకి
కమాను ఎవ్వరు ? నాకు
కావలసిన దేమిటో మీకు తెలియదు

కొడుకు

ఏమిటి ? ఏమిటి ?
మీకు కావలసిన దేమిటి ?

ఊహాసుందరి

నా కాళ్ళకి బలం
నా కళ్ళకి వెలుగు
నా హృదయానికి చోటు
నా స్టీమరు లంగరు దించడానికి
కావలసినంత లోతు

కొడుకు

అన్నీ ఈఫలంలోనే ఉన్నవి
ఇది స్వీకరించు
ఇది నా హృదయం

ఊహాసుందరి

అది మీ మది అయితే
అది నా ఎదలో స్వప్నం అయితే
స్వీకరిస్తాను ఇవ్వండి

కొడుకు

ఇప్పుడు నాకలకి ఆకారం వచ్చింది
నా ఆశకి చూపు వచ్చింది
నాగొంతుకలో గానం హెచ్చింది
నా కళ్ళలో వసంతం విచ్చింది

సేవకుడు

సినబాబుగోరూ
మూడో అమ్మాయి నాన్నగారొచ్చారు
ఆరితో అమ్మాయిని తీసుకొచ్చారు

ధనవంతుడు

క్షమించాలి లేటయింది
అమ్మాయి ఏడువారాల నగలు పెట్టుకొనడంలో
ఆలస్యమైంది ఇదిగో అమ్మాయి

మూడో అమ్మాయి

వందనం, మీకు అభివందనం....

ధనవంతుడు

ఏరీ మీ నాన్నగారు ?

కొడుకు

నేలమాన్యంలో ఉన్నారు వారు
ఏల మీరుకూడా అక్కడికి వెళ్ళకూడదు !

ధనవంతుడు

మా అమ్మాయిని కన్నారా చూసుకోనాయనా
నచ్చితే వెంటనే పెళ్ళిచేసుకో
భరతనాట్యం నేర్పించాను

మూడో అమ్మాయి

భరతఉద్దేశాల తాళాలలో
భరతనాట్యం చెయ్యగలను

ధనవంతుడు

సంగీతం నేర్పించాను

మూడో అమ్మాయి

నాధుడి నిర్దేశాల శ్రుతులో
అభిప్రాయ భేదాల అపశ్రుతులు
రాకుండా లేకుండా పాడగలను

ధనవంతుడు

అమ్మాయి నగలుచూడు
అమ్మాయిని చూడు

కొడుకు

క్షమించాలి, శమించాలి
నా ఉత్తరం మీద చిరునామా
నేనప్పుడే లిఖించుకున్నాను
నా భవిష్యత్కాలాన్ని
దుకూలంగా అప్పుడే ధరించుకొన్నాను
నాచేతిలోని జీవఫలాన్ని
నా భాగ్యదేవతకి సమర్పించుకొన్నాను

తండ్రి

ఏమిట్రా అబ్బాయి—ఎంచుకొన్నావూ ?
రండి రండి నేల మాన్యంలోంచి బయటికి రండి
మా అబ్బాయి ఎవర్నో ఎంచుకొన్నాడు

మొదటి అమ్మాయి

నేల మాన్యం బాగుంది

రెండో అమ్మాయి

అందులో చీకటి మరీ బాగుంది

శ్రీమంతుడు

మా అమ్మాయిని చేసుకుంటావా నాయనా ?

తండ్రి

ఎవరమ్మాయిని ఎంచుకున్నావురా ?
ఎవరు నీ జీవితాన్ని పంచుకొంటున్నారు ?

కొడుకు

ఎవరమ్మాయో నాకు తెలియదు
ఈమె నా పంచప్రాణాల పెరసి
ఈమె నాభూత భవిష్యద్వర్తమాన ప్రేయసి

తండ్రి

ఎవరీ అమ్మాయి ?

ధనవంతుడు

అలంకారాల్లేవే !

మొదటి అమ్మాయి

నాజూకుగా లేదే !

రెండో అమ్మాయి

అదే ఫేషనేమో !

మూడో అమ్మాయి

భరతనాట్యం వచ్చా ?

తండ్రి

అమ్మాయీ - ఎవరు మీ తండ్రి ?

ఊహాసుందరి

నాగలి నాతండ్రి

తండ్రి

ఎవరు మీ తల్లి ?

ఊహాసుందరి

సృష్టి నా తల్లి

తండ్రి

ఏమిటి నీ ఆస్తి

ఊహాసుందరి

ఎవరికైనా ఆస్తి ఏముంటుంది ?
సంగీతంలో సప్తస్వరాలు
సాహిత్యంలో ఏభై రెండు అక్షరాలు

తండ్రి

ఏమిటి నీ వృత్తి ?

ఊహాసుందరి

గుణింతం నా వృత్తి

తండ్రి

తప్పుపని చేశావురా అబ్బాయి
పప్పులో కాలు వేశావు
నేను చెప్పిన ముగ్గురు అమ్మాయిల్లో
ఈ అమ్మాయి చేరదు
ఆ అమ్మాయి చేతిలోని పండు లాక్కో
ఈ ముగ్గురులో ఒకర్ని ఎంచుకో

కొడుకు

సముద్రంలో కలిసిపోయిన నదిని
వెనక్కి మళ్ళించడం కష్టం
అర్పించిన హృదయాన్ని
తీసుకోవడం అసాధ్యం
ఇచ్చట కొచ్చిన మూడవ అమ్మాయి ఈమె
నా జీవితంలోని మూడవకాలం ఈమె
నా ఒకటవకాలం, అనగా, గతంమీరు
రెండవకాలం, అనగా, ప్రస్తుతం నేను
మీరు ఇవ్వమన్న ఫలం
నాభావికి అంకితం

తండ్రి

నువ్వు స్వీకరించినా లోకం
అంగీకరించవద్దా ?
నీ కలలు నీవైనా

నీ కన్నీళ్ళు మట్టుకూ నావి
నీ వెలుతురు నీదైనా
నీ చీకటిమట్టుకూ నాది

ఊహాసుందరి

మానవ గడియారానికి ఒక్కసారి కీ చాలు
అది మీరు...
కలకాలం మెయిన్ స్ప్రింగ్ కావాలి
అది నేను...
మగవాడి జీవితం ఒక సైకిలు
దాని ముందుచక్రానికి బ్రేకు తండ్రి
వెనుక చక్రానికి బ్రేకు భార్య

శ్రీమంతుడు

రంగుని ప్రేమిస్తా ననుకొన్నాను...

ధనవంతుడు

బంగారాన్ని వరిస్తా ననుకొన్నాను...

రెండో అమ్మాయి

వ్యాపార పుత్రికను నన్ను
వరించక తప్పదనుకొన్నాను...

మొదటి అమ్మాయి

సున్నితంగా లేని, ఖరీదైన
కళ్ళు లేనిదాన్ని వరించాడు
సీతాకోక చిలుకలం ముగ్గురం
ప్రీతితో ఒకర్ని వరించ మన్నప్పుడు

గొంగళీ పురుగుని ఎన్నుకొన్నాడు
గొంగళీ పురుగుని ప్రేన్నుకొన్నాడు

కొడుకు

మా నేల మాన్యంలో మరణించినా
మాట్లాడే చచ్చిపోయిన చిలుకకన్నా
వింతరకం చిలుకలు మీరు
ఘోషను చెప్పే పలుకులు
పలుకుతారు మీరు
మీరు సీతాకోక చిలుకలు కారు
మీ రంగులు సహజమైనవి కావు
మీ భావాలు నిజమైనవి కావు
నా గొంగళీ పురుగు నాకు చాలు
నా జీవిత పత్రాన్ని ఆహారంగా స్వీకరించి
నామీద తన జీవితం గూడుకట్టుకొని
నన్ను అంటిపెట్టుకొని
నా బ్రతుకులో నిద్రిపోయి
నా స్వప్నాలలోకి సీతాకోక చిలుకగా
ఎగిరి ఎగిరి ఆనందాన్నివ్వగలిగే
ఈ గొంగళీ పురుగు నాకు చాలు
ఇందులోంచే రాగలదు నిజమైన నిజం

సేవకుడు

బాబుగారూ! బాబుగారూ!
మన నేలమాన్యంలో సచ్చిపోయిన
సిలక మళ్లా బతికింది
దాని ముక్కుతో ఈ బల్లసెక్క మీద
ఏటో రాసింది నూడండి....

మొదటి అమ్మాయి

ఏం రాసింది?

రెండో అమ్మాయి

ఎలా రాసింది?

శ్రీమంతుడు

మాట్లాడే చిలుక రాతకూడా
రాస్తుందా...ఏం రాసింది

తండ్రి

మరణించినా మాట్లాడే
మా రామచిలుక
మళ్ళీ బతికి రాసిన మాటలు
రెండే అక్షరాలున్నాయి

కొడుకు

మొదటి అక్షరం : ప్రే

ఊహా సుందరి

రెండవ అక్షరం : మ

ఇద్దరూ

కూడబలికి చదివితే
'జీవితం' అని అర్థం.



కమ్మని లతాంతముల
దుమ్ము నెగజిమ్ము శక
టమ్ముల కఠోర నిన
దమ్ము లెసగన్ 'జూ'
ఇమ్ముచెడ చిక్కుపు గృ
హమ్ముల వసించెడి పి
కమ్ములు గళాల నిగ
ళమ్ములు ధరించన్
జుమ్మనుచు ఈగలు వ
నమ్ముల చరించి భ్రమ
రమ్ముల కొరంత కుసు
మమ్ములకు దీర్చన్
తెమ్మెరలు వీచక మ
నమ్ము నన పూచక భ
యమ్ముగ శఠించె నగ
రమ్మున వసంతం

ప్రేమికులకు నగరంలో
ఆమని అనవసరం
కామన ఉద్దీపించడానికి
ఈ మహానరకంలో
కావలసినన్ని సదుపాయాలున్నవి
స్వర్గాలున్నవి
గతాన్ని ఎదిరించి
స్వగతాన్ని వరించి
పంజరంలో ఇముడలేక
పల్లెలో ప్రాణవాయువులు పీల్చలేక
బొగ్గుపులుసు గాలుల
బోనులోకి, సూర్యుడు,
వినయ విధేయతలున్న
సర్కస్ జంతువులాగ
నగరంలోనికి పునఃప్రవేశించాడు
తగరంలా యథాశక్తి మెరిశాడు

నగరమనే వడ్డీ వ్యాపారివద్ద
నగలాంటి తనజీవితం తాకట్టు పెట్టాడు
ఆఫీసుల కార్ఖానాలో
అతిచిన్న చక్రంగా బ్రతకడానికి
అంగీకరించి అమ్ముడు పోయాడు

వైవాహిక జీవితమనే స్విమ్మింగ్ పూల్లో
వైఫుతో ఈదడానికి ముందు

ప్రణయమనే షవర్ బాత్
ప్రారంభించాడు

''కాఫీకి కవితకీ జ్వరంరుచి వచ్చి
కళ్లూమెదళ్లూ వరవళ్లు తొక్కి
రాళ్లు నీళ్లుగా, నీళ్లు వడగళ్ల ముళ్లుగా మారి
ఒళ్లంతా తేళ్లూ జెర్రెలూ పాకి
ఝాళ్ల కర్రలాంటి ఝాటు మెలికలు తిరిగితే
నో ఓవర్ టేకింగ్ – భావాల స్పీడు పదిమైళ్లు
బస్సు లేటయింది ప్రేయసీ! మిస్సు అవుతానా
తమస్సులో మన ఎంగేజి మెంటుకి ?
కాచుకుని వాచిన కళ్లు కొంచెం తుడుచుకో
వాచీ దయచేసి వెనక్కితిప్పుకో ప్రియతమా!
ప్లీజ్ వెయిట్

భ్రమించిన నా సెరిబ్రంలోని కోరికలు తిలకించి
నీ మెడుల్లా ఆబ్లాంగేటా పులకించి పులకించి
నా ప్రేమలేఖల బంగిమీాద
నీ అంగీకారాల పోష్టు ముద్రలువేసి
కలలో కలుసు కోడం మానేద్దాం ప్రియురాలా!
పబ్లిక్ పార్కులో పబ్లిక్ బెంచీమీద
పబ్లిక్ గానే కలుసు కొందాం
సబ్లిమేట్ చేసుకోడం ఎందుకు వాంఛలు
పాబ్లో పికాసో గుయర్నికా బొమ్మలో మాదిరిగా
సూర్య బింబాన్ని బెడ్ రూం లేంపుతో వెలిగిద్దాం

హీబ్రూభాషలాగ నవ్వాడి చేసే బానిస సముద్రం
జీబ్రాలాగ లైట్‌హౌసు ఆల్‌జీబ్రాలాగ నక్షత్రాలు
అభ్రవీధిలో అభ్రకం శకలంలాగ అశుభ్రజ్యోత్స్న
ఈసురోమని ఇసుకలో కాళ్లీడ్చుకొనే గ స్త్రీపోలీసు
ఫేసు పౌడరు ఊడిపోతున్న ఆంగ్లోఇండియన్ అమ్మాయి
ఘూయింగ్‌గమ్ము నములుతున్న ఆంగ్లోఅబ్బాయి
వూయింగ్

పెరఫెక్టు వాతావరణం నెచ్చెలీ కరక్టుఎట్మాస్ఫియరు

[టాక్సీ వెయిటింగ్ చార్జీలు పెరుగుతున్నాయ్
జేక్సీటులోనే తొందరగా ప్రేమ మాటలుముగించే
ద్దామా]

ప్రేమ ఎక్స్ప్రెస్ చెయ్యడానికి ఐడియల్ వెదర్
డార్లింగ్!

సంజెవేళ సముద్ర తీరాన బఠాణీలు కొనడం ఎందుకు
ఐస్‌క్రీం పార్లార్‌లో పీచ్‌మల్బా ఇప్పించనా హనీ!
రోడ్డువార మూడు మూరల సన్నజాజుల దండకన్నా
ఈవినింగ్ బజారులో క్యూటెక్సుకొని ప్రజెంటుచేస్తా
టెక్నికలర్ హాలీవుడ్ త్రీ–డీ మేటనీకివెళ్దామా స్వీట్!
వచ్చే సండేనాడు సింప్లీ మార్వెలెస్ సినిమా ఉంది
[వచ్చే ఆదివారం ఓవర్‌టైం పని చెయ్యాలంటాడు
మచ్చుకైనా సింపతీలేని ఆఫీసరాధముడు]

ఇవాళ ఇక్కడికే బీచిలో కూర్చొని జీడిపప్పుతిందాం
చెట్టాపట్టాలు కట్టుకొని కెరటాలు చూస్తూ
స్వప్నాలు కందాం

ఇండియా కాఫీ హౌసు మూసేశారు కనుక
నేటికి ఇరానీలో టీ యే తాగుదాం (అదేచౌక)
ఎల్లుండి నారాయాం మేట్ ఊరికెళుతున్నాడు
ఆవలెల్లుండి ఆఫీసులో ఆఫ్ తీసుకొంటాను
ఇంక్రిమెంటు ఇవ్వగానే పెళ్ళిచేసుకొందాం
ఇలాగే ప్రస్తుతానికి కలుసుకొంటూ ఉందాం

[జేబులు ఖాళీ బరాబరు : కారణమేమిటి ? నెలాఖరు !]
ఆవలెల్లుండి అవశ్యం నా రూము కొస్తావుకదూ
టాక్సీని పంపించెయ్యడం పొరపాటైంది
ఆఖరి బస్సు వెళిపోతుంది లేద్దామా స్వీట్ హార్ట్''



దేవదుందుభులు మ్రోగ లేదు
దేశం పండుగ చేసుకోలేదు
రాకపోకలు ఆగిపోలేదు
రహదారులు రమణీయంగా లేవు
పెళ్ళిపందిరి వేయలేదు
కళ్లాపులుజల్లి రంగవల్లికలు పెట్టలేదు

మామిడాకులు కట్టలేదు
మనోజ్ఞమైన అలంకరణలు లేవు
రిజిస్ట్రార్ కచేరీలోనున్న
గుమాస్తాలు కన్నెత్తి కలంవిడిచి చూడలేదు
మంత్రాల అనలవేదిక ముందుకాక
యంత్రాల అనిల వీచికలందు
ఎన్ జీవో సూర్యుని వివాహం
ఎవరూ లక్ష్యపెట్టకుండా జరిగింది
సంతకాలు పెట్టిన సాక్షులు
సంతసించారో లేదో చెప్పలేము
ఫైలుకాగితాలమీద నవారు ముడివేసి
వాళ్ల జీవితాలు అధికారరీత్యా ముడివేసినట్లు
రిజిస్ట్రారు ప్రకటించినట్టుకూడా చెప్పలేము
గుమస్తా చేయిచాపినట్టుమాత్రం చెప్పగలం
చూస్తున్నవాళ్ల సంగతి కేంగాని
సూర్యుని సహధర్మ ఇహాకర్మచారిణి గర్భంలో
రూపం ఏర్పరుచుకొంటున్న పాప
లోపల లోపల ఉబ్బిపోయింది
తక్కిన ప్రపంచం మాటేమోగాని
దంపతుల గుండెల్లో ఎండ చల్లబడింది
వాళ్ళజీవితాలు మనోజ్ఞంగా ప్రేమ
వజ్రాలతో అలంకరించు కున్నాయి
మనస్సుల అనురాగ ద్వారబంధాల
మమతల మామిడాకులు వేళ్ళాడుతున్నాయి

కన్నీళ్లు, తియ్యనివి, కళ్లాపు జల్లి
కామనలు రంగవల్లికలు దిద్దాయి
విశాల హృదయాలు రెండూ ఒకటై
పెళ్ళిపందిరిలాగ వెలుగసాగాయి
వాళ్ళ రంగురంగుల కోరికల రహదారులు
వర్ణణీయంగా రమణీయంగా ఉన్నాయి
భవిష్యత్తు గురించి భయాలరాకపోకలు
ప్రస్తుతం మనసులో ఆగిపోయాయి
వాళ్ళకళ్ళకు దేశం పండుగ చేసుకున్నట్టుంది
వాళ్ళ చెవులలో దేవదుందుభులు మ్రోగాయి...



౮

చక్కని సంతోషాల చిలుక లెగిరిపోయాయి
ఇక్కట్ల గబ్బిలాలు యింట్లో స్థిరపడ్డాయి
పదేళ్ళలో పాతికేళ్ళు గడచినట్లయి
హృదయం అక్కడక్కడ తుప్పుపట్టింది

ముచ్చట్ల ముఖం ముడుతలు తేరింది
పచ్చదనం ఎక్కడికో పారిపోయింది
పుట్టింటివారి వద్దనుంచి పుట్టెడు దుఃఖాలూ
నిట్టూర్పులూ అప్పులూ నికరంగా వచ్చాయి

మునుపటి జీవితాని కీనాటి బ్రతుకు
ఎనిమిదవ కార్బను కాపీలా కనబడి
ఆశలూ ఆశయాలూ అలుక్కుపోయాయి
శ్వాస తీసుకోవడమే కష్టంగా ఉంది

యతిప్రాసలూ గణాలూ అన్నీ కుదిరినా
అతకని అర్థాల కందగర్భసీసంలాగ
నియమాలకు తల ఒగ్గి చరియిస్తున్నా
నిరర్థకంగా బతుకుతున్నాడు సూర్యుడు

కాళ్లు వాటంతట అవి కచేరీకి పోతాయి
కలం దానంతట అది రాసుకు పోతుంది
ఒళ్ళు ఒకంతట విశ్రాంతి తీసుకోలేదు
కళ్ళు తమనుండి కారే అశ్రువులు దాచుకోలేవు

ఒకనాడు వితంతు వెదురైతే ఆమెపట్ల
ప్రకటించేవాడు మదిలోన సానుభూతి
ఇపుడెవరైనా తుమ్మితే తన ముక్కూడుతుందని
అపశకునం అరిష్టాలకి పోస్టు బంట్రోతనుకుంటాడు

దేవాలయాల కెన్నడూ పోనివా డీనాడు
దేవుడనే లాటరీ టిక్కెట్టుకొనుక్కున్నాడు
స్వర్గమనే డర్బీ స్వీపులోని సౌఖ్యాలడబ్బు
సాక్షాత్తూ ఇక్కడే ఇమ్మని కోరుకుంటున్నాడు

రెండుగంటల రాత్రి, ఎండి వరుగైన సతి
రెండు కన్నులలోకి తొంగి చూస్తాడు
ఛిద్రుప లైన స్వప్నాల సేకరిస్తాడు
నిద్రలో తెలివిలో ఇలా తలపోస్తాడు

"హస్తమా? మస్తిష్కమా
సృష్టిస్త ఈ జగతును
భగవంతుడా? బలవంతుడా
విధిస్త ఈ విపత్తుని
భగవంతుని చిరునామా
జగమందే దొరుకుతుందా?
సుఖమెరుగని నా జీవం
కలకాలం సాగుతుందా?

బలవంతుని సామ్రాజ్యం
చిరకాలం జరుగుతుందా ?
బలవంతుడే భగవంతుడా
ధనవంతుడే భగవంతుడా
భగవంతుని కొలతలు ఏమిటి ?
అసలాతడి ఆఫీసెక్కడ ?

ఆదిశక్తి ఆకారం ఏమిటి ?
స్థాణువా చంచల రేణువా
బిందువా అవధిలేని సింధువా ?
ఊహల నడిపించే ప్రాణమా
ఊపిరి చంపే కృపాణమా
అనిలమా ? అనలమా ?
మన్నా ? మిన్నా ? నీరా ?
అన్నీ కలసిన రూపమా ?
ఎవరయ్యా కారణం
మానదా నా ప్రశ్నల వ్రణం
దేవునికి దరఖాస్తు పెట్టేందుకు
ఏది ప్రాపరుఛానలు
అవకాశాల ప్లాటుఫారాలు
అదృష్టాల రైళ్ళూ ఏమీ లేని
సిటీబుకింగ్ ఆఫీసేనా
జీవితం ?
పారేసుకొన్న నాపసితనం ఎక్కడుంది ?
పగిలిపోయిన కలల పెంకులు
బాగా అతికించ గల వాడెవరు ?

నేనెవర్ని ? నే నెవర్ని ?
నా పక్కన శయనించే
ఈ మాజీ చక్కదన మెవరు ?
నువ్వెవరు ?

నీవు నాలో లోలోపలి నేత్రానివా ?
నాకు నేను లిఖించుకొన్న శిక్షాపత్రానివా ?
నీవు నా మోక్షకిరణాల నాపే ఛత్రానివా
నీవు నా ఆశాలతలు ఖండించే లవిత్రానివా ?

నేను నివురుకప్పిన విజ్ఞాన హోమాగ్నినా
తుప్పుపట్టి పనికిరానట్టి శతఘ్నినా
నీకు ఎన్నడూ తీర్చలేని ఋణాన్నా
నీపాలిటి కాపాలికుల కృపాణాన్నా

నువ్వెవరివి నే నెవర్ని
ఎక్కడికీ స్పృష్టి నడక ?
ఏటిలోన సగంలోన
ఎందులకీ పుట్టి మునక

మెదడులో మబ్బు క్రమ్మి
ఎడదలో గాలి రేగి
చైతన్య సీమలో
చెలరేగెను ప్రశ్నల గాలివాన
గాలివాన హోరులోన
కారణాల కలరుతాలు వినబడవు
జన్మించిన తొలినాడే
ప్రశ్నించెను నరుని మెదడు

నువ్వెవరివి నే నెవర్ని
ఎక్కడికీ సృష్టినడక ?
నాటినుండి నేటివరకు
పునరపి పునరపి
అవే సందేహాలు
అవే నిర్వేదాలు
కొలతల కందని దూరదూర తీరాల
మినుకుమినుకు మనే చుక్కలార
ఈ చిక్కును విప్పరేల
నే నడిగే ప్రశ్నల తాళంచెవులకు
సరిపోయే కారణాల తాళంకప్ప లెక్కడ ?
ఏరహస్యాలు దాచిపెట్టిన
గోడవున్నవు అవి వేసున్నవి
బ్రతుకెందుల కింత చేదు
నా కెందుకు సుఖంలేదు
ఏ కితాబులో దొరుకుతుంది
ఈ ప్రశ్నలకి జవాబు
ఏ రబ్బరుతో చెరుగుతుంది
ఈ మృతనష్టపు నశీబు ? ? ?



౨౪

క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
పార్కులో కెళ్ళాడు పనిలోంచివచ్చి
మేజాల భూజముల మేదినిలోంచి
చిత్రాల చీటాల చిట్టడవిలోంచి

రొప్పుకొని రోజుకొని రోజెల్ల గడపి
గాలికై జాలికై గాలించగాను
పార్కులోకొచ్చాడు వర్కులోనుంచి
క్లార్కు సూర్యారావు కాళ్ళీడ్చుకొచ్చి

పార్కులో ఉంటారు పడుచుదంపతులు
పార్కులో ఉంటారు పాత స్నేహితులు
పార్కులో ఉంటారు పసి పిల్లవాళ్ళు
పార్కులో ఉండనిది పరిశాంత మొకటి

క్లార్కుసూర్యారావు పార్కులోనుంచి
మార్కెట్టుకెళ్లాడు మార్పుకోసరము

మార్కెట్టులో మంచి సరుకులుంటాయి
డబ్బున్నవాళ్లకి దొరుకుతుంటాయి

మధ్యతరగతివాళ్ల కోరికతింటాయి
మనవాడి మనసుని తినివేస్తాయి
క్లార్కు సూర్యారావు మార్కెట్టునుంచి
కూర్కుతీద్దామని గృహమునకు పోయె

ఇల్లు ఇర్కటము ఆలి మర్కటము
ఆఫీసులో దొర, అసలు కర్కాటకం
పార్కులో విశ్రాంతి కనలేదు తాను
మార్కెట్టులో సుఖము కొనలేదు తాను

క్లార్కు సూర్యారావు అర్కుడేగాని
కలకాలముండే గ్రహణానచిక్కె
తలుపులున్నవిగాని వలపులు లేవు
అనుకోడమేగాని అనుభవం లేదు

కనుమూసి కనుతెరచి కలగాంచుటే సదా
గుండెలో నున్నవి ఎండమావులు కదా
క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
కోర్కెల ఊబిలో కూరుకుపోయె

అలసిపోయెను అతడు తలుపు దగ్గరనె
తలుపు తట్టుటమాని తనువుమరచాడు
నిలుచున్న పాళాన నిదురపోయాడు
నిదురలో నిడుపైన కలను గన్నాడు

క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
క్లార్కు సూర్యారావు కలగన్నాడు
కలలోన సూరన్న తన యింటికొచ్చె
కష్టాలు నష్టాలు వెతలు కన్నీళ్ళు

పుస్తెకట్టిన ఆలు పుట్టింటికేగె
పుట్టెడు సౌఖ్యాలు స్వాగతము పలికె
క్లార్కు సూర్యారావు కలకలానవ్వె
మూర్ఖో నెను మూర్ఖో నెను ముచ్చటలగాలి

కలలోన సూరన్న తలపు తట్టాడు
నట్టింటిలోనుంచి నాతి ఒకతొచ్చె
వంటింటిలోనుంచి వనిత ఒకతొచ్చె
పడకగదిలోనుంచి పడతి ఒకతొచ్చె

క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
కమ్మగా నవ్వాడు కాంతలను చూసి
కలలోన సూరన్న కనబడగానె
నట్టింటిలో చెల్లి నగలు తెమ్మనదు

వంటింటిలో వదిన వద్దు లేవనదు
పడకగదిలో భార్య పస్తుపడుకోనదు
క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
కడకు సంతోషాన్ని కన్నాడుకలలో

కలలోన సూరన్న కనబడగానే
తన పిల్లలే తనను దెయ్యమనుకోరు

పొరుగింటిలో వాళ్ళు భూతమనుకోరు
ఇరుగింటి వాళ్ళ తను ఈసడించేను

కలలోన కలలోన కలలోన మాత్రం
క్లార్కు సూర్యారావు కడుబలశాలి
కలలోన తా నాగర్భ(శ్రీ)మంతుడు
అతగాడిపిల్లలకు ఆరోగ్యముండు

రస్కులు బిస్కెట్లు చాకెట్లు తిండి
ఇస్కూలు జీతాలు ఫస్టునే కట్టు
క్లార్కు సూర్యారావు కడసారికొడుకు
మార్కులను తెస్తాడు ఫస్టునే ఎపుడూ

కలలోన సూరన్న కలువరించాడు
తలుపుదగ్గర అతడు పలువరించాడు
రోగిష్టి పెళ్ళాము రొప్పుకొని వచ్చి
తలుపు తీసింది కన్ను మూసింది

క్లార్కు సూర్యారావు కరడుకట్టాడు
క్లార్కు సూర్యారావు మార్పులు లేదు
క్లార్కు సూర్యరావు క్వొశ్చెన్ మార్కు
క్లార్కు సూర్యారావుకాగితం కార్కు



నిరుడు ఉలికిన
నీర్కావి ఆదివారాన్ని కుచ్చిళ్ళుపోసి
తొందరగా
తొడుక్కున్న శనివారంపై లోతుగా దోపి
తెరిపిచ్చిన ముసురు-తెరలు
తొంగిచూపుకి తగినంతతీసి మూసి
కిరణాలను ఆర్పేసి
కిటికీలను వేసి దీపం తగ్గించేసి
ఎన్జీవో సూర్యుడు
ఏమిటి చేస్తున్నాడు ఏమిటి చూస్తున్నాడు
దూలంకింద వ్రేలాడే
కాలంతాడు మూడుపేటలుగా ఏల నేస్తున్నాడు
తణిఖీకై దయచేసే
అధికారుల రాకకొరకు వేసిన వేషంతో
పట్టపగటి గది చీకటి కరక్కాయ సిరాలోన
తర్జని ముంచి కొంచెం దులిపి
గచ్చూడిన పావుతావు పడగ్గది నేలమీద
ఏమిటి రాస్తున్నాడు
తుడుపులతో తప్పులతో రచించిన
ఈ పిటిషన్ పనికొస్తుందా
ఉతుకులో ఊడిన తారకల
కర్రబొత్తాయిల కాళరాత్రి ఆల్పాకాకోటు
హారీబరీలో అడ్డదిడ్డంగా
తిరగేసి తొడుక్కుని తీసి మరగేసి

ఉద్యోగం ఊడిన సూర్యుడు
ఏమిటి చేస్తున్నాడు ఏమిటి చేస్తున్నాడు
ఏ దొరగారికి
దొరికిపోతే ముప్పని భయపడుతూ చూస్తున్నాడు.

"అయ్యా మృత్యువుగారూ !
పిల్లలవాణ్ణి దయచేసి కనికరించండి
అద్దెకుంటున్న ఈ జీవితం వాటాకి
నిజమే ఆదినుంచి బాపుగ బాకీ
అయ్యా మృత్యువుగారూ !
పండుక్కి కోర్కెల గోడలకి వెల్ల వేయించండి
పడిపోయిన యౌవనం పెరటిగోడలు
ఈ ఏడైనా మరమ్మత్తు చేయించండి
ఇకమీదట సెక్సుపాపాల పిడకలతో
గోడలు ఖరాబు చెయ్యను ఖరారు
నిత్యనైమిత్తికాల వంటింట్లో
చూరునుంచి లేమికారుతూంది చూడండి
కలలపంచనుండికారే సంతృప్తిధార
నిద్దుర బిందెలలో పట్టుకోనీండి
అయ్యా మృత్యువు గారూ !
పరిస్థితుల పెంకులు తిరగ నేయించండి
ఆశయాల ధరలు మండిపోతున్నాయి

అద్దె కొద్దిగా తగ్గించండి
దయచేసి తక్కిన వాటాలవాళ్ళని
త్యాగాల ముగ్గులు పెట్టమనండి
నుయ్యి కొంచెం లోతు చేయించండి
పోనీ బురదైనా తీయించండి
ఆ భయం మీ కళ్ళల్లోను
అందులో మట్టుకు పసి చావను
జ్ఞాపకాల సందుగులు అనుభవాల పరుపులు
రోడ్డుమీద పారేయకండి
బాబ్బాబూ వచ్చేజన్మలో చూసుకుందాం
ఈ సారికి ఊరుకోండి
అయ్యా మృత్యువుగారూ!
పిల్లలవాణ్ణి కనికరించి కనికరించండి''



# తప్పొప్పుల పట్టిక

భగవంతుని అచ్చాఫీసు
ప్రచురించిన మానవ ప్రకృతి కావ్యంలో
లెక్కలేని అచ్చు తప్పుల్ని
ఇక్కడ మానవుడే దిద్దుకోవాలి

సాంఘిక గ్రంథాన్ని సనాతనులు
చాదస్తపు నియమాలతో బైండు చేశారు
ఆ కుట్లూ కట్లూ సడలించి మళ్లా
ఆధునికంగా క్యాలికోబైండు చేద్దాము

అలా చేయడానికి ముందుగానే
అడ్డ దిడ్డంగా నున్న బ్రతుకుల ఫారాలను
యథాస్థానాలలో సర్ది సామాజిక
కథాక్రమాని కడ్డులేకుండా చేద్దాము

యుగపురుషులు ఫూ్రిఫ్ రీడర్లు
జగత్ కావ్యాన్ని సరిదిద్దినా
పరిస్థితుల కంపోజిటర్లు
కరక్షన్లు చేయడానికి ఒప్పులు లేవు

కొత్త ఒప్పులు సృష్టించుకొందాం
మొత్తం కావ్యం పునర్ముద్రిద్దాం
అంతదాకా ఈ తప్పొప్పుల పట్టిక
అందరం తయారుచేద్దాం గట్టిగ

ఈ కావ్యం విషాదాంత మనుకోడం తప్పు
అసలు అంత మవుతుందను కోడమే తప్పు
ఇది అనంతం సౌఖ్యవంతం అనడం ఒప్పు
ఈ నిరాశ లోంచి ఆశ జనించడం ఒప్పు

సమకాలిక జీవన విభావరిలో
తమస్సులు ఘనీభవించాయనుకోవడం తప్పు
అతి సన్నని వెలుగు రేక లేదనుకోవడం తప్పు
ఆశాచంద్రకళ గల ఇది సినీవాలి అనడం ఒప్పు.





**ప్రకటనలు చూసి**
**మోసపోకండి!!**

వ్యాపార ప్రకటన దేనికైనా అవసరమేమోగాని కావ్యాలకి అనవసరమని మా ఉద్దేశం.

ఈ కావ్యం గొప్పతనం గురించిగాని, కవి గురించిగాని మేము వాణిజ్య ప్రకటన చేయదలుచుకో లేదు.

సాధారణ వివరాలు చెప్తాం. అసాధారణ విషయాలు కావ్యం చదివి మీరే తెలుసుకొంటారు.

కవి : ఆరుద్ర.
కావ్యం : సినీవాలి.
వస్తువు : ఆధునిక జీవనం.
ప్రచురణ :
యం. శేషాచలం కంపెనీ.
దర : రు. 1.75.



